నోరూరించే...మనసుదోచే...మైమరపించే.









క్రొత్త పార్లే

పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు.
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరి!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్ నారగించండి-

everest/122b/PP Tel



# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["రాక్షస వివాహం"] కయిపు ఆదిశేషారెడ్డి రచన.

ఈ సంచికతో "ఒకరోజు రాజు" పూర్తి అయింది. పై మాసం నుంచి మరొక అరేబియా జానపద కథ ప్రారంభమవుతుంది. "సమయస్ఫూర్తి" అన్న కథలో ఒక సత్యం ఉన్నది. మోసంతో కూడుకున్న ప్రపంచంలో - ఎంత జ్ఞాని కూడా మోసం చెయ్యకుండా నెగ్గుకు రాలేడు. మనం "లోకజ్ఞానం" అనేది నూటికి తొంభై పాళ్ళు ప్రజలను మోసగించే తెలివితేటలే!

సంపుటి 51 డిసెంబర్ '72 సంచిక 6



# పోయిన ఉంగరం

ఒక శబరరాజు దగ్గిర ఇల్లుడూ, పులిదొరా అనే ఇద్దరు కొలువు చేసేవాళ్ళు. వాళ్ళిద్దరూ మంచి స్నేహితులు. ఇద్దరూ నమ్మకమైన వాళ్ళే. కాని రాజుకు ఇల్లు డంటే అభిమానమూ, పులిదొర అంటే ద్వేషమూ ఉండేది.

ఒకరోజు రాజు ఆ ఇద్దరినీ పిలిచి, "మీ రిద్దరూ సెలవు తీసుకుని ఇళ్ళకు పొండి. మూడు రోజుల అపతల సంబరం జరుగుతుంది. దానికి రండి. ఇవిగో మీ బహుమానాలు," అంటూ పులిదొరకు పెద్ద కందదుంపా, ఇల్లుడికి చిన్నరాయీ ఇచ్చాడు. ఇద్దరూ రాజుకు దణ్ణాలు పెట్టి ఇళ్ళకు బయలుదేరారు.

తనకు రాజు పనికిమాలిన రాయి ఇచ్చాడని ఇల్లుడికి లోపల కాస్త గుసుపుగా ఉంది, "ఈ వెధవ రాయిని పనికట్టుకుని ఇంటికి మోసుకు పోవటం కూడా దేనికి, యిక్కడే ఏ పొదలోనో పారేస్తాను," అన్నాడు.

"వద్దు, వద్దు. ఈ కందదుంపను మొయ్యలేక చస్తున్నాను. మనం వస్తువులు మార్చుకుందాం," అన్నాడు పులిదొర.

ఇద్దరూ తమ తమ బహుమానాలు మార్చుకుని తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఇల్లుడు తన భార్య చేత కంద వండించుకు తిన్నాడు.

పులిదొరకు రాయి మాట ఆ రాత్రిదాకా జ్ఞాపకం రాలేదు. అతను ఇంటి బయట వెన్నెలలో కూర్చుని, ఆ రాయి తీసి పరీక్షిస్తూ ఉండగా, దాని పగులులో ఏదో తళుక్కున మెరిసింది. అతను ఆ రాతిని పగలగొట్టేసరికి దానిలోపల నేర్పుగా దాచి ఉన్న బంగారు నగలు బయటపడ్డాయి.

రాజు పక్షపాతబుద్ధి పులిదొరకు అర్థమయింది. ఆ నగలు ఇల్లుడి కోసం ఉద్దే

అర్. రఘునాథరావు

శించినవి. అయినా వాటిని తానే ఉంచుకోవటానికి పులిదొర నిశ్చయించాడు. బహుమతులు మార్చుకోవటం జరిగింది గద.

మూడు రోజుల అనంతరం రాజుగారి ఇంటి వద్ద సంబరమూ, విందూ జరిగాయి. ఎంతోమంది వచ్చారు. భోజనాలు చేసే సావిడిపాక కిటకిటలాడి పోయింది. రాజు అందరినీ పలకరిస్తూ, పులిదొర ధరించిన ఆభరణాలు చూసి, "ఇవి నీకు ఎక్కడివి?" అని అడిగాడు.

తాము బహుమానాలు మార్చుకున్న సంగతి ఇల్లుడూ, పులిదొరా రాజుకు తెలిపారు. రాయి విలువ తెలియక దాన్ని పులిదొరకు ఇచ్చినందుకు ఇల్లుడు రాజుకు క్షమాపణ కూడా చెప్పుకున్నాడు.

రాజు ఇల్లుణ్ణి క్షమించాడు, కాని పులిదొరను హతమార్చటానికి నిశ్చయించాడు. విందు ముగిసి అందరూ సెలవు పుచ్చుకుని వెళ్ళేటప్పుడు పులిదొర రాజుతో, "ఈ నగలు నేను ఉంచుకున్నందుకు ఏలినవారు క్షమించాలి. తమరిచ్చిన బహుమానాలను మేము న్యాయంగా మార్చుకున్నాం. కండగడ్డను ఇల్లుడూ, భార్యా భోంచేశారు," అన్నాడు.

"నిన్ను మనస్ఫూర్తిగా క్షమిస్తున్నాను. అందుకు నిదర్శనంగా నీకు నా ఉంగరం బహుమానంగా ఇస్తున్నాను. దీన్ని భద్రంగా దాచి, వచ్చే వారం ఇదేరోజున నాకు తెచ్చి చూపించు. దీన్ని పోగొట్టుకున్నావంటే మటుకు నీకు మరణశిక్ష విధిస్తాను.





9




గుర్తుంచుకో!" అన్నాడు రాజు, పులిదొరకు తన వేలి ఉంగరం ఇస్తూ.

రాజు తన మీద పగపట్టినట్టు పులిదొర గ్రహించి, ఆ ఉంగరాన్ని ప్రాణప్రదంగా కాపాడ నిశ్చయించుకున్నాడు. అతని గుడిసెలో ఉంగరాన్ని దాచే చోటే లేదు. అందుచేత ఆ రాత్రి తన భార్యా, కొడుకూ నిద్రపోయేటప్పుడు అతను తన ఇంటి మట్టి గోడలో రంధ్రం తొలిచి, అందులో ఉంగరాన్ని పెట్టి, తడిమట్టితో రంధ్రాన్ని కప్పి, గుర్తు తెలియరాకుండా ఆ మట్టిని గోడతో సమంగా చదునుచేసేశాడు. దానికి గోడ రంగు వచ్చేసింది. ఇక తన ప్రాణానికి ముప్పంలేదనుకున్నాడు పులిదొర.

రెండు రోజులు గడవనిచ్చి రాజు పులి దొర భార్యను పిలిపించి, "నీ మొగుడు ఉంగరం ఎక్కడ దాచాడో కనుక్కొని తీసుకువచ్చి నా కియ్యి. నీకు బోలెడంత బంగారం ఇస్తాను. ఈ మాట నీ మొగుడితో ముందుగా అనకు; బంగారం చూసినప్పుడు అతను ఆశ్చర్యపోతాడు," అన్నాడు.

రాజు తన భర్త ప్రాణం తీయదలచి ఉంగరం అడిగాడని పులిదొర భార్య ఎరగదు. ఆమె ఉంగరం కోసం ఇల్లంతా గాలించింది. ఉంగరం కనిపించలేదు.

ఆ సాయంకాలం ఆమె, తన భర్త ఇంటికి రాగానే, "నీ దగ్గిర ఏదో ఉంగరం ఉండెనే, అది ఏమయింది?" అని అడిగింది.

ఉంగరం తన భార్య కళ్ళ పడనేపడిం దనుకుని పులిదొర, "గోడలో దాచాలే," అన్నాడు.

మర్నాడు భర్త బయటికి వెళ్ళిన సమయంలో పులిదొర భార్య గోడలన్నీ శ్రద్ధగా పరిశీలించింది; అనుమానంగా ఉన్న చోట నల్లా గోడలో గీరింది. చిట్టచివరకు ఆమెకు ఉంగరం దొరకనే దొరికింది. ఆమె చప్పున ఆ రంధ్రాన్ని మట్టితో పూడ్చి, ఉంగరం తీసుకుని రాజుగారి ఇంటికి పరిగెత్తింది.

రాజు ఉంగరం తీసుకుని, ఆమెకు సంచీలో బంగారం ఇచ్చాడు. ఆమె పరమా

నందంతో ఇంటికి తిరిగి వచ్చి, ఆ సంచీని ఇంటి వెనక పూడ్చిపెట్టింది.

వారం పూర్తి అయిన రోజున పులిదొర దగ్గిరికి రాజుగారి మనిషి వచ్చి, "ఉంగరం తీసుకుని రాజుగారు రమ్మంటున్నారు," అని చెప్పాడు.

పులిదొర తాను ఉంగరం దాచిన చోట వెతికి, ఉంగరం పోయినట్టు తెలుసుకుని, "నా ఆయువు మూడింది!" అనుకున్నాడు.

అతను తన భార్యను పిలిచి, ఉంగరం చూశావా అని అడిగాడు. నిజం చెబితే భర్త కొడతాడని గ్రహించి ఆమె ఉంగరం చూడ లేదన్నది.

పులిదొర కాళ్ళీడ్చుకుంటూ రాజు వద్దకు వెళ్ళి, ఉంగరం చూపలేనన్నాడు.

"అయితే నీకు మరణదండన తప్పదు," అన్నాడు రాజు.

"శిక్ష రేపటిదాకా వాయిదా వెయ్యండి. ఈ లోపల నా వ్యవహారాలు చక్కబెట్టు కుంటాను," అన్నాడు పులిదొర.

"సరే, రేపు ఉదయం కసాయీలను నీ యింటికి పంపుతాను," అన్నాడు రాజు.

పులిదొర కాళ్ళీడ్చుకుంటూ తన ఇంటికి బయలుదేరాడు. కాని మధ్య దారిలో అత నికి వాగు ఒడ్డున కూర్చోవాలనిపించింది. అతని మనసు మనసులో లేదు.

"రేపు ఎలాగూ చస్తున్నాను గనక ఇవాళ ఒక్క సుఖమైనా అనుభవిస్తాను. వాగులో పెద్ద చేపను పట్టి, నాకు కావలిసినట్టు వండించుకు తింటాను," అనుకుని పులి



దొర బొర్డులో నుంచి చేపలు పట్టే గాలం పైకి తీసి, నీటిలో వేశాడు.

కొంతసేపటికి చేప పడింది. పైకి తీసి చూస్తే అది ఒక పెద్ద తెల్ల చేప. పులిదొర దాన్ని తీసుకుని ఇంటికి వెళ్ళేసరికి, ఇంటి వద్ద అతని భార్య లేదు. ఆమె వచ్చే లోపుగా తానే చేపను శుభ్రం చేశామనుకుని అతను దాన్ని కత్తితో కోసి, ఆనందంతో, "ఉంగరం! రాజుగారి ఉంగరం!" అని కేక పెట్టాడు.

అతను అప్పటికప్పుడే రాజుగారి ఇంటికి పరుగుతీస్తూ, దారిలో కనిపించిన ప్రతి మిత్రుడితోనూ, "నా ఆయువు మూడిందే అనుకున్నాను, కాని బతికిపోయాను!" అని గట్టిగా అరిచి చెప్పాడు. అతను రాజుగారి ఇంటికి చేరేసరికి అతని వెంట ఒక పెద్ద మూక తయారయింది.

"బయట ఏమిటా కోలాహలం?" అని రాజు తన నౌకర్లను అడిగాడు.

అంతలోనే పులిదొర తన మిత్రులతో సహా లోపలికి వచ్చి, రాజుతో, "ఇదుగో మీ ఉంగరం. నా మరణదండనను మీరు రద్దుచెయ్యవచ్చు." అన్నాడు.

అంతమంది సమక్షంలో రాజు మరణ దండనను రద్దు చెయ్యక తప్పలేదు. అదీ గాక, తన చేతికి తిరిగి వచ్చిన ఉంగరం మళ్ళీ పులిదొర వద్దకు ఎలా వెళ్ళిందో, ఏ మాయశక్తులు పులిదొరకు సహాయపడు తున్నాయో రాజు ఊహించలేకపోయాడు. ఆయన తిరిగి పులిదొరకు అపకారం చేసే ప్రయత్నం ఏమీ చెయ్యలేదు.

నిజానికి జరిగినదేమంటే, పులిదొర భార్య తనకు ఉంగరం తెచ్చి ఇయ్యగానే రాజు దాన్ని తన తల దగ్గిర ఉండే పీట మీద ఉంచాడు. ఆ రాత్రి ఒక ఎలుక పీట మీదుగా పరిగెట్టుతూ, ఉంగరాన్ని నీళ్ళ కుండలోకి తోసింది. మర్నాడు రాజుగారి నౌకరు అలవాటు ప్రకారం ఆ కుండలోని నీళ్ళు వాగులో పారబోసి కొత్త నీరు పట్టుకు పోయాడు. రాజుకు యివేమీ తెలియనందున, తన ఉంగరం తిరిగి పులిదొరకు ఎలా దొరికినదీ ఊహించలేక పోయాడు.



# తేడా

ఒక గ్రామంలో సుబ్బారాయుడు అనే ఆస్తిపరుడు ఉండేవాడు. ఎవరి కష్టసుఖాలతోనూ ఆయనకు నిమిత్తం లేదు. తనకేదన్నా కలిసివచ్చేటట్టుంటేనే ఏ విషయంలోనైనా జోక్యం కలిగించుకునేవాడు.

ఆ ఊళ్ళోనే రాము డనే పేద వాడుండేవాడు. వాడు అందరికీ తల్లో నాలికలా ఉండి, ఎన్నో విధాల సహాయపడుతూ ఉండేవాడు. అందుకు వాడు ప్రతిఫలం కూడా ఆశించే వాడు కాడు. కాని గ్రామస్థులు వాణ్ణి కనిపెట్టుకుని ఉండి, అవసరం వచ్చినప్పుడు ఆదుకునే వారు.

ఒకసారి రాముడు ఏదో పనిమీద దూర గ్రామం వెళ్ళి, చాలా రోజుల పాటు తిరిగి రాలేదు. వాడు లేకపోయేసరికి చాలామందికి చెయ్యి విరిగినట్టయింది. "రాముడు ఎప్పుడు తిరిగొస్తాడో?....వాడు ఇంకా ఎందుకు తిరిగి రాలేదబ్బా?" ఇలా జనం అను కోవటం సుబ్బారాయుడు విని ఆశ్చర్యపడ్డాడు. సుబ్బారాయుడి భార్యే, "రాముడు అదే పోత పోయాడేమిటి?" అని చాలాసార్లు అనుకున్నది.

కోలీ విలవ చెయ్యని రాముణ్ణి గురించే గ్రామస్థులు ఇంతగా అనుకుంటూంటే, తన వంటి సంపన్నుణ్ణి గురించి ఎంతగా అనుకుంటారో గదా అని, సుబ్బారాయుడు పొరుగూరు వెళ్ళి, రెండు వారాలుండి తిరిగివచ్చాడు.

ఊళ్ళోకి ప్రవేశిస్తూండగానే రంగన్న అనే రైతు ఎదురుపడ్డాడు.

"ఏం రంగన్నా, ఏమిటి విశేషాలు?" అన్నాడు సుబ్బారాయుడు.

"ఏమున్నయ్యండీ? నిన్ననే రాముడు తిరిగొచ్చాడు. మీకు మాత్రం తెలీదా?" అన్నాడు రంగన్న.

"నేను రెండు వారాలుగా ఊళ్ళో లేనులే!" అన్నాడు సుబ్బారాయుడు.

"అలాగా? ఎవరూ మాట మాత్రం చెప్పలేదే!" అన్నాడు రంగన్న.

—వసుంధర.






ఉత్తమం స్వార్జితం విత్తం,
మధ్యమం పితురార్జితం,
అధమం భ్రాతృవిత్తంచ,
స్త్రీ విత్త మధమాధమం. 1

[తాను సంపాదించిన డబ్బు ఉత్తమం. తండ్రి సొమ్ము మధ్యమం. అన్నదమ్ముల సొమ్ము అధమం. స్త్రీ ధనం అధమాధమం.]

ఉత్తమం కుల విద్యాయా,
మధ్యమం కృషి వాణిజాత్,
అధమం సేవకావృత్తేః.
మృత్యు శ్చౌర్యోపజీవనాత్. 2

[కుల విద్య ఉత్తమమైనది. వ్యవసాయమూ, వర్తకమూ మధ్యమమైనవి. సేవకావృత్తి అధమం. దొంగ బతుకు చావుతో సమానం.]

ఉత్తమే క్షణకోపస్స్యాత్,
మధ్యమే ఘటికాద్వయం,
అధమే స్యా దహోరాత్రం,
పాపిష్ఠే మరణాంతకం. 3

[ఉత్తముడి కోపం క్షణకాలం ఉంటుంది. మధ్యముడిది రెండు ఘడియ లుంటుంది. అధముడిది ఒక పగలూ, రాత్రీ ఉంటుంది. పాపిష్ఠి వాడిది బతికినంతకాలం ఉంటుంది.]

ఉత్తమం — మధ్యమం — అధమం




## 7

[మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ తరుముకుంటూపోయిన ఖడ్గ జీవదత్తులకు, గుహలో వాళ్ళు కనిపించలేదు. ఆ ఇద్దరూ ఒక రహస్యద్వారం వెంటపోయి పెద్ద పెద్ద శిథిల భవనాలున్న చోటుచేరారు. ఆ భవనాల్లో వున్న పూజారిణి, ఖడ్గ జీవదత్తులను బంధించ మని మాంత్రికుణ్ణి ఆజ్ఞాపించింది. వాడు కత్తి తీసుకుని బయలుదేరాడు. తరవాత—]

తమ ముందున్న శిథిల భవనాల కేసి కన్నార్పకుండా చూస్తూ జీవదత్తుడు, అవి ఏ కాలం నాటివై వుండవొచ్చు, ఏ కారణం చేత జనశూన్యమై పోయి యిలాంటి శిథిల స్థితికి వచ్చినై; అని ఆలోచించసాగాడు. ఖడ్గవర్మకు మాత్రం ఆ మాంత్రికుణ్ణీ, జడల భూతాన్నీ పట్టుకుని ఎంత త్వరగా హత మార్చి అక్కడి నుంచి బయిటికి పోదామా అని ఆత్రంగా వున్నది.

ఒకటి రెండు నిమిషాల కాలం ఖడ్గ జీవ దత్తులు మౌనంగా ఎవరి ఆలోచనల్లో వారు న్నారు. అంతలో వాళ్ళు కూర్చున్న చోటుకు దాపుల నున్న ఒక రాతి గోడను ఏదో బలమైన వస్తువు గట్టిగా తాకినట్టు శబ్దం అయింది.

ఆ శబ్దం వింటూనే ఖడ్గవర్మ చప్పున లేచి నిలబడి, "జీవా, ఏమిటా శబ్దం? ఆ దుర్మార్గులిద్దరూ మన మీద దొంగదెబ్బ



తీయాలని బయలుదేరి రావటం లేదు గదా?" అన్నాడు.

"ఆ మాంత్రికుడికీ, జడలభూతానికీ పట్టపగలు మన మీద దాడి చేసేటంత ధైర్యం వున్నదనుకోను. అయినా మన జాగ్రత్తలో మనం వుండాలి," అంటూ జీవదత్తుడు గోడ దగ్గిరకు బయలుదేరాడు.

ఖడ్గ జీవదత్తులిద్దరూ శిథిలావస్థలో వున్న రాతి గోడను సమీపించి అవతలికి చూడబోయేంతలో, మాంత్రికుడు ఎగిరి గోడ మీదికి వచ్చి, "నరమానవుల్లారా! మీ యిద్దర్నీ యిప్పుడే మహా భూతానికి బలి చేస్తున్నాను!" అంటూ కత్తిని జీవదత్తుడి కంఠం కేసి విసిరాడు.

ఖడ్గవర్మ తన కత్తితో మాంత్రికుడి కత్తిని పక్కకు నెట్టి, "మాంత్రికశుంఠా! ఆ బలి ఏదో చేయక వాచాలత కొద్దీ ముందుగానే మమ్మల్ని హెచ్చరించి ప్రాణం మీదికి తెచ్చుకున్నావు." అంటూ వాడి చేయి పట్టుకుని ముందుకు గుంజాడు. మాంత్రికుడు దభీమంటూ గోడ మీది నుంచి కిందికి పడిపోయాడు.

ఈ సంఘటన జరుగుతున్న సమయంలోనే గోడ అవతల నుంచి కొన్ని కంఠాలు, "ఒరే, వెర్రి మాంత్రికుడా, వాళ్ళను చంపకు! పూజారిణి వాళ్ళను ప్రాణాలతో గదా పట్టుకు రమ్మన్నది," అంటూ అరిచినై.

ఈ లోపల, "బలి! బలి! బలి!" అంటూ జడలభూతం తన గురువుకు పట్టిన గతి కానక ఆవేశోత్సాహంలో గోడ మీదికి కొండ ముచ్చులా గెంతి నిలబడింది.

భూతం కిందికి చూసి తన గురువు నేల కరిచివుండటం గమనించి కీచుమని అరవబోయేంతలో జీవదత్తుడు దాని కాలుపట్టుకుని బలంగా లాగి, అది కిందపడబోయే సమయంలో నడుంమీద గట్టిగా ఒక్క తన్ను తన్ని, "ఖడ్గా, మనం యిక యిక్కడ నిలబడటం క్షేమం కాదు. ఈ ప్రదేశమంతా మాంత్రిక వెధవల పుట్టలావుంది. గోడ అవతల అరుపులు విన్నావా? మనం ఆ కనబడే భవనాల్లో దేనిలోకైనాపోయి వాళ్ళు

మనను చుట్టుముట్టకుండా చూసుకుందాం," అన్నాడు.

ఆ వెంటనే యిద్దరూ శిథిల భవనాల కేసి పరిగెత్తి, ఒక గదిద్వారం ముందు నిలబడి మాంత్రికుల గుంపు గోడదూకి తమ కేసి వస్తున్నారేమో అని వెనక్కు తిరిగి చూశారు. వాళ్ళకు గోడపక్కన రెండు చేతులతో నడుం పట్టుకుని మూలుగుతున్న జడల భూతం, బెణికిన మోచేతిని అటూ యిటూ తిప్పే ప్రయత్నం చేస్తూ, అబ్బా, అబ్బా, అంటున్న మాంత్రికుడూ తప్ప ఎవరూ కనిపించ లేదు.

"గోడ అవతలి నుంచి వచ్చిన హెచ్చరిక విన్నావా? ఆశ్చర్యంగా లేదా?" అన్నాడు ఖడ్గవర్మ.

"ఆశ్చరం ఎందుకు? ఆ దుర్మార్గులు తమ మిత్రులకు చేసిన హెచ్చరిక వల్ల మనకు ఈ శిథిల భవనాల్లో రాణివాసం వెలిగిస్తున్న పూజారిణీ, ఆవిడ మనిద్దర్నీ ప్రాణాలతో పట్టుకు రమ్మనటం తెలిసి పోయింది. ఇక మన జాగ్రత్తలో మనం వుండి, ఆ పూజారిణినే పట్టుకుని సంగతి సందర్భాలేమిటో తెలుసుకుందాం!" అన్నాడు జీవదత్తుడు నవ్వుతూ.

ఆ తరవాత యిద్దరూ శత్రువులు తమ మీదికి ఎటునుంచి దాడివస్తారో అని ఒకటి రెండు నిమిషాలు ఊపిరిబిగబట్టి నిలబడ్డారు. కాని ఎక్కడా శత్రువుల అచూకీ లేదు. జడలభూతం, మాంత్రికుడా మొండిగోడ పక్కన కూర్చుని బాధతో మూలిగే మూలు





గులు తప్ప, ఆ ప్రదేశాన మరెలాంటి శబ్దమూ లేదు.

ఖడ్గవర్మ తాము నిలబడివున్న ద్వారం కేసి ఒకసారి పరీక్షగా చూసి, "జీవా! ఈ బలమైన కొయ్య తలుపులు చూశావా? వీటివెనక భవనాల్లో దేనిలోకోపోయే మార్గం వుండి వుంటుంది. తెరిచి చూద్దామా?" అన్నాడు.

"ఇక అంతకన్న చేసేదేముంది? ఎంత సేపని యిక్కడ నిలబడగలం. ఆ మాంత్రిక భూతాలను వాళ్ళ కర్మకు వదిలి, తతిమ్మా వాళ్ళ వ్యవహారం తేలుద్దాం. తలుపులు మాత్రం జాగ్రత్తగా తెరవాలి. మాంత్రికుల మంద వాటి వెనక మనకోసం ఆయుధాలు పుచ్చుకుని కాపేసుకు వున్నావుండొచ్చు!" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ ఒక చేతిలో కత్తి సిద్ధంగా పట్టుకుని రెండవ చేత్తో తలుపులను బలంగా నెట్టాడు. అవి కిర్రుమంటూ కొంచెం కదిలినవే తప్ప తెరుచుకోలేదు.

"తలుపులకు వెనక గడివేసి వున్నదేమో అన్న అనుమానం మనకెందుకక్కలగ లేదు!" అంటూ జీవదత్తు వాటిని బలంగా రెండు చేతులతో పట్టుకుని వెనక్కు నెట్టాడు. తలుపులు కిర్రుమనే రణగొణ ధ్వనులతో ఒక్కసారిగా తెరుచుకున్నవి.

ఖడ్గ జీవదత్తులిద్దరూ గడపదాటి లోపలికి వెళ్ళారు. అది చాలా విశాలమైన గది. అంతా ఖాళీగా వున్నది. అందులో మనుషులు ఎన్నడైనా నివశించిన సూచనలే లేవు. గది అన్ని మూలలా పెద్ద పెద్ద సాలెగూళ్ళూ, గోడల నుంచి వేలాడుతున్న గబ్బిలాలూ వాళ్ళ కంట బడినై. ఆ గది చివర తలుపులు విరిగి, పక్కకు ఒరిగిపోయి వున్న ఒక ద్వారం కనిపించింది.

"ఇక జాగు చేయుటం ఎందుకు? నిండా మునిగిం తర్వాత చలేమిటి! పద, ఈ శిథిల భవనాల్లోని అన్ని గదులూ వెతుకుదాం. ఏ గదిలోనైనా మాంత్రికుల నాయకురాలు పూజారిణి కనిపించక పోదు!" అన్నాడు జీవదత్తుడు.

ఇద్దరూ జాగ్రత్తగా నడుస్తూ పోయి రెండవ గదిలో ప్రవేశించారు. అది మొదటి దానికన్న భీభత్సంగా వున్నది. వాళ్ళు రావటం చూస్తూనే బాగా బలిసి వున్న పందికొక్కులు నాలుగైదు 'బొక్, బొక్' అని అరుస్తూ గదిలో అటూ యిటూ పరిగెత్తసాగినై. గద్ద ప్రమాణంలో వున్న గుడ్లగూబ ఒకటి పైనుంచి కిందికి బాణంలా ఎగిరి వచ్చి వాటిల్లో ఒకదాన్ని పట్టుకుని, అంత ఎత్తులో వున్న ఒక కిటికీ గుండా బైటికి ఎగిరిపోయింది.

"ఆహాఁ, ఏం పందికొక్కులు, ఏం గుడ్లగూబలు! అన్నీ వాటి మామూలు ప్రమాణానికి రెండింతలు మూడింతలుగా వున్నవే! ఈ శిథిల భవనాల ప్రాంతాన ఏం తిని యివి యింతగా దుక్క బలిసిపోయినట్టు?" అన్నాడు ఖడ్గవర్మ.

"బహుశా, పూజారిణి వాటికి అప్పుడప్పుడూ తన శిష్యుల్లో దుక్క బలిసిన వాళ్ళను మేతగా వేస్తున్నదేమో!" అంటూ జీవదత్తుడు పెద్దగా నవ్వి, "ఊఁ, పద, ముందు ముందు మరేం వింతలు వున్నవో చూద్దాం!" అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు ఆ విధంగా మరికొన్ని గదుల్లో ప్రవేశించారు. కొన్నిచోట్ల మెట్లెక్కి భవనాల్లోని పై భాగాలు చూశారు. వాళ్ళకు ఎక్కడా మనిషిగాని లేక మనిషి నివసించిన జాడలున్న ప్రదేశం గాని కనిపించలేదు.

"ఖడ్గా, మాంత్రిక వెధవలు వాళ్ళ నాయకురాలి ఆజ్ఞను మహా తెలివిగా అమలు





చేయ చూస్తున్నట్టున్నది. నా అనుమానం వాళ్ళు మనను రహస్యంగా వెన్నంటి వస్తున్నారని. ఆ పూజారిణి మనను ప్రాణాలతో గదా తన దగ్గిరకు పట్టుకు రమ్మన్నది. మనం ఏ భవనంలో ప్రవేశించి, మరే భవన ప్రాంతానికి చేరామో కూడా తెలియటం లేదు!'' అన్నాడు జీవదత్తుడు.

''మనం తిరిగి పోదామంటావా ఏం?'' అని అడిగాడు ఖడ్గవర్మ.

''అంతకన్న చేసేదేముంది? ఈ శిథిలాల్లోంచి మళ్ళీ వెలుగులోకి పోవాలంటే గుహలో నుంచి వున్నదారే శరణ్యం గదా. అక్కడికి చేరగలమేమో చూద్దాం!'' అన్నాడు జీవదత్తుడు.

''ఇక్కడ నుంచి బయటపడి గాయపడిన భూతాన్నీ, మాంత్రికుణ్ణీ పట్టుకుని నాలుగు తన్ని ఆ పూజారిణి కథ ఏమిటో తెలుసుకుందాం,'' అన్నాడు ఖడ్గవర్మ.

వాళ్ళిద్దరూ అంతకు ముందు తాము వచ్చిన గదిద్వారం కేసి నడిచి, అందులోకి అడుగు పెట్టేంతలో హఠాత్తుగా వాళ్ళ తలల మీద రెండు బలమైన కర్రదెబ్బలు పడినై. ఆ దెబ్బలకు యిద్దరికళ్ళూ బైర్లు కమ్మి కిక్కురుమనకుండా ముందుకు పడిపోయారు. వెంటనే నలుగురు పూజారిణి భృత్యులు ముందుకు వచ్చి, ఆదుర్దాగా వాళ్ల తలలు పరీక్షించి చూశారు. ఎక్కడా నెత్తురు బయిటికి చిమ్మిన జాడ కనబడలేదు.

''అదృష్టవంతులం! ఈ ఇద్దరు మానవ ప్రాణుల తలలూ పగిలినయ్యేమో అనుకున్నాను. వీళ్ళు చస్తే, మహాశక్తి పూజారిణి చేతుల్లో మనం చచ్చేవాళ్ళం,'' అన్నాడొక భృత్యుడు.

''చావకుండా దిమ్మతిరిగి పడేందుకే గదా, దుడ్డుకర్రలకు మెత్తని గొంగళి పీలికలు చుట్టాం. ఎందుకైనా మంచిది వీళ్ళ కాళ్ళూ చేతులూ కట్టి భుజానవేసుకొండి, పూజారిణి దగ్గిరకు తీసుకుపోదాం,'' అన్నాడు మరొక భృత్యుడు.

స్పృహతప్పి పడివున్న ఖడ్గ జీవదత్తుల్ని పూజారిణి భృత్యులు కాళ్ళూ చేతులూ

తాళ్ళతో బంధించి భుజాల మీద వేసుకుని అనేక చీకటి గదులు దాటి ఒక విశాలమైన మంటపంలోకి తీసుకుపోయారు.

మంటపం మధ్య మెత్తని తివాసీలు పరిచివున్న ఒక ఉన్న తాసనంమీద పూజారిణి కూర్చుని వున్నది. ఎడంగా కొందరు భృత్యులు చేతులు కట్టుకుని నిలబడి వున్నారు. తన భృత్యులు తెచ్చిన ఖడ్గ జీవదత్తుల కేసి పూజారిణి ఒకసారి ఓర కంటితో చూసి, అంతలోనే గతుక్కుమని కళ్ళింతచేసి, "అరెరె, మహాభూతా! వీళ్ళల్లో ఒకడు మంత్రవేత్తలా కనబడుతున్నాడే!" అన్నది.

"అయేవుంటాడు, మహాశక్తి పూజారిణీ! వాడిచేతిలోదండం కూడా వున్నది. ఈ రెండవ వాడి దగ్గిర యింత పొడవాటి ఖడ్గం వున్నది." అన్నాడొక భృత్యుడు.

"అవేమయినై? ఎక్కడైనా పారేసి వచ్చారా?" అన్నది పూజారిణి.

"వీళ్ళను పట్టిన చోటునే వదిలివచ్చాం," అన్నాడొక భృత్యుడు.

"పోయి తీసుకురండి, వెధవల్లారా. ఎలాంటి మందమతులు!" అంటూ పూజారిణి కళ్ళెర్ర చేసింది.

పూజారిణి ఆజ్ఞవింటూనే యిద్దరు భృత్యులు పరిగెత్తిపోయి క్షణాల మీద దండాన్నీ, కత్తినీ తెచ్చి ఆమె ముందుం



చారు. పూజారిణి వాటిని శ్రద్ధగా కొద్ది సేపు పరీక్షించి, "వీటిల్లో ప్రత్యేక శక్తులేవీ వున్నట్టు కనిపించటం లేదు. వీళ్ళను చీకటి గదిలో బంధించి, వీటిని పక్కనే పడవేసి రండి. తరవాత ఏం జరుగుతుందో చూద్దాం," అన్నది.

యింకా స్పృహ తెలియని స్థితిలోవున్న ఖడ్గ జీవదత్తుల్ని నలుగురు భృత్యులు భుజాలమీద వేసుకుపోయి ఒక చీకటిగదిలో పడవేసి, బయట గడిపెట్టారు.

ఒక పావుగంట తరవాత ఖడ్గ జీవదత్తులకు స్పృహ వచ్చింది. ముందుగా స్పృహ తెలిసిన జీవదత్తుడు ఖడ్గవర్మను తట్టి లేపి, "ఖడ్గా, ఆశ్చర్యం! ఇంకా మనం బతికే



21

వున్నాం. మన ఆయుధాలు కూడా మన పక్కనే వున్నవి," అన్నాడు.

ఖడ్గవర్మ గది నలుమూలలూ ఒకసారి పరీక్షగా చూసి, "మన నిలా ప్రాణాలతో వదలటంలో పూజారిణి ఎత్తుగడ ఏమై వుంటుంది?" అన్నాడు.

"ఆ పూజారిణి పురుగును చూస్తే తప్ప దాని ఎత్తుగడల సంగతి చెప్పటం కష్టం. మనం ముందు బయటపడాలి," అంటూ జీవదత్తుడు లేచి నిలబడ్డాడు.

"ఆ దుర్మార్గులు పొంచివుండి మనకు మూంచి బడితపూజ చేశారు. యిక వాళ్ళను దొరికితే మాత్రం ప్రాణాలతో........"

ఖడ్గవర్మ మాట పూర్తి చేసేలోపలే గోడ అవతలి నుంచి సింహం గర్జించిన ధ్వని వినబడింది. అది వింటూనే ఖడ్గవర్మ ఎగిరి నిలబడి, "ఆ వెధవలు మనమీద సింహాన్ని ప్రయోగించాలని చూస్తున్నారా ఏం?" అంటూ నవ్వాడు.

"ఇదీ ఒకందుకు మంచిదే. మనం ఆ సింహాన్ని వాళ్ళమీదనే ప్రయోగించి, యీ శిథిల భవనప్రాంతాలను భీభత్సం చేద్దాం!" అంటూ జీవదత్తుడు తనదండంతో బలంగా గోడను ఒక పోటుపొడిచాడు. గోడలో కొంతభాగం పిడుగుదెబ్బ తిన్నట్టు పెద్ద శబ్దంతో విరిగి వెనక్కు పడిపోయింది. పక్కగదిలోవున్న సింహం బెదిరి చిన్నగా గర్జిస్తూ గోడ వారగాపోయి నిలబడింది.

"సింహరాజా, నీకు విముక్తి, ఆహారం కూడా దొరకబోతున్నది," అంటూ జీవదత్తుడు తామున్న గదితలుపులను దండంతో బలంగా రెండు పోట్లుపొడిచాడు. తలుపులు ఫెళ ఫెళ మంటూ విరిగి దభీమంటూ ముందుకు పడిపోయినై.

ఆ మరుక్షణం పదీ పన్నెండు మంది పూజారిణి భృత్యులు, "బందీలు పారి పోతున్నారు, పట్టుకోండి!" అని అరుస్తూ ముందుకు వచ్చారు. వెంటనే జీవదత్తుడు సింహాని కేసి పరిగెత్తి, దాన్ని దండంతో పూజారిణి భృత్యుల కేసి తరిమాడు. అది గర్జిస్తూపోయి వాళ్ళమీద పడింది.

—(ఇంకావుంది)





# రాక్షస వివాహం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నువు ఎవరి మాట నమ్మి ఈ అపరాత్రి వేళ ఇలా శ్రమ పడుతున్నావోగాని, సింహపురి రాజైన విజయవసంతుడి లాగా మాట తప్పే వారుంటారు. నీకు శ్రమ తెలియకుండా అతని కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

విజయవసంతుడు అసాధారణమైన బలపరాక్రమాలు కలవాడు. యుద్ధవిద్య లలో అతనికి సమానులు లేరని ప్రతీతి. అతనికి అరుణకుమారి అని ఒక కుమార్తె ఉండేది. తండ్రి పరాక్రమంలాగే, ఆమె అందం కూడా దేశదేశాలా మారుమోగి పోయింది.

## బేతాళ కథలు



అరుణకుమారి యుక్త వయస్కు రాలయింది. ఆమెను ఎవరికి ఇచ్చి పెళ్ళి చెయ్యాలి అన్న సమస్య దివాణంలో చర్చకు వచ్చినప్పుడు రాజు అందరి సూచనలూ తోసిపుచ్చి, "నన్ను యుద్ధవిద్యలలో మించగల వాడికే నా కూతురునిచ్చి పెళ్ళి చేస్తాను." అన్నాడు.

ఈ మాట ఆధారం చేసుకుని మంత్రులు అరుణకుమారికి స్వయంవరం ఏర్పాటు చేస్తూ, అన్ని యుద్ధవిద్యలలో పోటీ చేసి గెలిచిన వాడికే రాజకుమార్తెతో వివాహం జరుగుతుందన్న నిబంధన ప్రకటించారు.

ఈ ప్రకటన అన్ని దేశాలకూ వెళ్ళింది గాని శాకలపురికి మాత్రం వెళ్ళలేదు. అందుకు కారణం సింహపురికీ శాకలపురికీ బద్ధవైరం ఉండటం.

అయితే శాకలపురి రాజకుమారుడు కమలశేఖరు డనేవాడు అరుణకుమారిని చాలా కాలంగా పెళ్ళాడ గోరుతున్నాడు. ఆమెకు స్వయంవరం ఏర్పాటయిన సంగతి మరొక రాజకుమారుడి ద్వారా అతడికి తెలిసింది. అతను ఆ రాజకుమారుడి చెలికాడులాగా అతని వెంట స్వయంవరానికి బయలుదేరి వచ్చాడు.

స్వయంవరంనాడు అందరు రాజకుమారులతో బాటు కమలశేఖరుడు కూడా గుర్రపు స్వారీ, కత్తియుద్ధమూ, గదాయుద్ధమూ, విలువిద్య పోటీలలో పాల్గొని, అందరినీ ఓడించాడు.

అరుణకుమారి అతని మెడలో వరమాల వెయ్యటమే తరవాయి. ఆ సమయంలో విజయవసంతుడు కమలశేఖరుణ్ణి కౌగలించుకుని, "కుమారా, యుద్ధ విద్యలలో నీ ప్రావీణ్యాన్ని మెచ్చాను. నువు ఏ దేశపు రాజకుమారుడివి? నీ పేరేమిటి?" అని అడిగాడు.

"నేను శాకలపురి రాజకుమారుణ్ణి. నా పేరు కమలశేఖరుడు," అన్నాడు కమలశేఖరుడు.

విజయవసంత మహారాజు కోపోద్రేకంతో, "హీనుడా, తక్షణం ఇక్కడినుంచి వెళ్ళిపో.

ఈ సారికి నిన్ను ప్రాణాలతో వదులుతున్నాను," అని గర్జించాడు.

కమలశేఖరుడు అంతకన్న కోపోద్రేకంతో, "నువు పెట్టిన పరీక్షలో నెగ్గినప్పుడే నీ కుమార్తె నాకు వధువు అయింది. వేనామెను పెళ్ళాడకుండా ఎలా ఆపుతావో చూస్తాను," అంటూ ఒరలో నుంచి చర్రున కత్తి దూశాడు.

విజయవసంతుడు కూడా కత్తి దూశాడు. ఇద్దరూ ఒకరి ప్రాణాలు ఒకరు తీయదలచినట్టుగా పోరాడారు. ఆ పోరాటంలో విజయవసంతుడు కత్తి పట్టిన చేతికి బలంగా గాయం తగిలింది.

వెంటనే కమలశేఖరుడు అరుణకుమారిని చెయ్యి పట్టుకుని తీసుకుపోయి, తన గుర్రం మీద ఎక్కించుకుని తన దేశానికి వెళ్ళిపోయాడు.

ఆ రోజే విజయవసంతుడు రణభేరీ వేసి, సైన్యాన్ని తరలించుకుని, శాకలపురి మీద యుద్ధానికి వెళ్ళాడు.

మర్నాడు ఉదయం శాకలపురి సేన యుద్ధసన్నద్ధమై వచ్చింది. సేనకు ముందున్న యోధులలో కమలశేఖరుడేగాక అరుణకుమారి కూడా ఉన్నది.

అది చూడగానే విజయవసంతుడు యుద్ధం ఆపుచేయించి, తన కుమార్తెనూ, అల్లుణ్ణీ కౌగలించుకుని ఆశీర్వదించి, వారి వెంట శాకలపురి ప్రవేశించి, తన గర్వశత్రువైన శాకలపురి రాజుతో సఖ్యం చేసుకుని, తన కుమార్తె వివాహం వైభవంగా



జరిపించి, ఎంతో సంతోషంగా తన దేశానికి తిరిగి వెళ్ళాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, విజయ వసంత మహారాజు ప్రవర్తనకు అర్థం ఏమిటి? తాను పెట్టిన నియమం ప్రకారం అన్ని యుద్ధ విద్యలలోనూ నెగ్గిన కమల శేఖరుడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేయ టానికి ఆయన నిరాకరించటమేగాక, అతన్ని కత్తి యుద్ధంలో చంపటానికి ఎందుకు ప్రయత్నించాడు? తరవాత అతని మీదికి యుద్ధానికి వెళ్ళినవాడు యుద్ధం చెయ్యక తానే స్వయంగా దగ్గిర ఉండి పెళ్ళి ఎందుకు చేయించాడు? ఈ సందేహానికి తగిన సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కమలశేఖ రుణ్ణి అరుణకుమారి వివాహానికి ఎవరూ ఆహ్వానించలేదు. అతనికి యుద్ధ విద్యల పోటీలో పాల్గొనే హక్కులేదు. అతను తన శత్రువైనా కూడా అతన్ని ప్రాణాలతో వదల టానికి విజయవసంతుడు సిద్ధపడ్డాడు. కాని కమలశేఖరుడే ఆయనమీద కత్తి దూశాడు. తన ప్రాణం తీయదలచిన వాణ్ణి చంప టానికి ప్రయత్నించటం తప్పుకాదు. విజయ వసంతుడు యుద్ధానికి పోవటం కూడా సరిఅయిన పనే. ఆయన తన కుమార్తెకు స్వయంవరం తలపెట్టితే అది రాక్షస వివాహంగా పరిణమించింది. అందుచేత విజయవసంతుడు తన కుమార్తెను విడి పించుకు రావటానికి యుద్ధం తలపెట్టాడు. కాని తనతో యుద్ధం చెయ్యటానికి తన కుమార్తె స్వయంగా వచ్చేసరికి ఆమె తనను ఎత్తుకు పోయినవాణ్ణి ఇష్టపడే పెళ్ళాడు తున్నట్టు స్పష్టమయింది. రాక్షసవివాహం ధర్మవిరుద్ధం కాదు గనక దానికి విజయ వసంతుడు సంతోషంగా ఒప్పుకుని, తన అల్లుడితో శత్రుత్వం కొనసాగించటం భావ్యం కాదు గనక అతని కుటుంబంతో సఖ్యం చేసుకున్నాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# ముగ్గురు మూర్ఖులు

చంద్రవంక అనే నది ఒడ్డున వేపవరం అనే ఒక గ్రామం ఉండేది. ఆ గ్రామంలో ఉండే మందమతులు చాలా ప్రసిద్ధులు. వేపవరం వాళ్ళు సంతకు వెళ్ళాలంటే నది దాటి వెళ్ళాలి.

నది మీది వంతెన వద్ద ఒకనాడు ఇద్దరు గ్రామస్థులు కలుసుకున్నారు.

" నువ్వు ఎక్కడికి పోతున్నావు ? ఎందుకు పోతున్నావు ? " అని ఒకడు రెండోవాణ్ణి అడిగాడు.

" సంతలో గొర్రెలను కొనుక్కురాబోతున్నాను," అన్నాడు రెండోవాడు.

" ఏ దారిన వస్తావు ? " అని మొదటివాడు మళ్ళీ అడిగాడు.

" ఈ వంతెన మీదిగానే ! " అన్నాడు రెండోవాడు.

" నేను రానిస్తేగద ? " అంటూ మొదటివాడు ఉత్తుత్త గొర్రెలను చెదరగొట్టు తున్నట్టు నటించాడు. వెంటనే రెండోవాడు ఆ ఉత్తుత్త గొర్రెలను మళ్ళించసాగాడు.

ఇద్దరూ ఇలా, లేని గొర్రెలను చెదరగొట్టటమూ, మళ్ళించటమూ చేస్తూ ఉండగా మూడోవాడు నెత్తిన పాలబిందెతో వచ్చి, సంగతి తెలుసుకున్నాడు. వాడు తన బిందెలోని పాలను నదిలోకి బోర్లించి, " ఈ బిందెలో ఇప్పుడెన్ని పాలున్నాయి ? " అని అడిగాడు.

" ఏమీ లేవు," అన్నారు మొదటివాళ్ళు.

" మీ ఇద్దరికి అంతమాత్రం మెదడు కూడా లేదు," అన్నాడు మూడోవాడు.






# సమయస్ఫూర్తి

ఒక ఊళ్ళో భద్రయ్య అనేవాడు హస్త సాముద్రికంలో చాలా గట్టివాడు. ఆ చుట్టు పక్కల గ్రామాలలో భద్రయ్యకు చెయ్యి చూపించనివాడు లేడు. అతను చెయ్యి చూసి మనిషి మనస్తత్వం ఎటువంటిదైనదీ, ఆ మనిషికి లోగడ ఏమేమి జరిగినదీ, ముందు ఏమి జరగబోయేదీ చూసినట్టు చెప్పేవాడు.

హస్తసాముద్రికం వృత్తిగా పెట్టుకున్న వాళ్ళు భద్రయ్య పేరు ప్రతిష్ఠలు విని, అతనికి వెరచి, అతనుండే గ్రామం చాయలకు వెళ్ళేవారు కారు. ఎవరన్నా పొరపాటున వస్తే భద్రయ్య వాళ్ళను పదిమంది లోనూ పరీక్షకు పెట్టి, మూడు చెరువుల నీళ్ళు తాగించి మరీ గ్రామం నుంచి బయిటికి పంపేవాడు.

భద్రయ్య సంగతి తెలియక రామశాస్త్రి అనేవాడు చేతులు చూసి ప్రశ్నలు చెబుతానంటూ ఆ గ్రామానికి వచ్చాడు. రామశాస్త్రి ఊళ్ళోకి వచ్చేసరికి గ్రామచావిడి వద్ద భద్రయ్య నలుగురితోపాటు చేరి లోకాభిరామాయణం మాట్లాడుతూ కాలక్షేపం చేస్తున్నాడు.

రామశాస్త్రి కూడా చేతులు చూసేవాడని తెలియగానే భద్రయ్య, "ఏమయ్యా, నువు ఏయే గ్రంథాలు చదివావు? నీ గురువుగారెవరు? హస్తసాముద్రికంలో ఏయే విభాగాలు నీకు తెలుసు? అసలు నీదే వూరు?" అని ప్రశ్నలు వేశాడు.

"అయ్యా, నేను హస్తసాముద్రిక శాస్త్రం చాలా కొద్దిగా చదివాను. నాకు తెలిసినది బహుకొద్ది. తెలిసినంతవరకే ప్రశ్నలు చెప్పి పొట్టపోసుకుంటున్నాను. ఇక ఊరా? పుట్టి పెరిగిన ఊరు ఏనాడో వదిలేశాను. ఎక్కడ పొట్టగడిస్తే, అదే నా ఊరు," అన్నాడు రామశాస్త్రి అణకువగా.

కె. కె. రావు




అతని అణకువ చూసి భద్రయ్య రెచ్చి పోయి, "నీ మిడిమిడి జ్ఞానం చూసి ఈ వూళ్ళోవాళ్ళు డబ్బులిచ్చేటంత వెర్రి వాళ్ళు కారయ్యా! నా సంగతి నువు విన లేదు కాబోలు. హస్తసాముద్రికంలో అందె వేసిన చెయ్యని నేనుండగా నీకు ఈ ఊళ్ళో మంచి నీరు కూడా పుట్టదు. అందుచేత మరోవూరు చూసుకో!" అని నిష్ఠురంగా అన్నాడు.

అది విని రామశాస్త్రికి కోపం వచ్చింది. ఈ భద్రయ్య అహంకారాన్ని అణచకుండా వెళ్ళగూడదనుకుని అతను, "అయ్యా, ఎవరంతటివారు వారు! నేను మీ కన్న గొప్పవాణ్ణని ప్రగల్భాలు పలకలేదు. కాని మీరు ఏ ఆధారమూ లేకుండానే నన్ను తీసి పారేశారు. తరతమ భేదాలు నిర్ణయ మయేది పరీక్షలో గదా? మీకు నా కన్న ఎక్కువ తెలిసినట్టు ఏ ఆధారం మీద చెబుతున్నారు?" అని అడిగాడు.

అక్కడ చేరినవారు రామశాస్త్రి చెప్పినది సబబేననీ, ఇద్దరూ ఎరగని మనిషి చెయ్యి చూసి ఆ మనిషిని గురించి చెబితే, ఎవరు చెప్పినది సరిగా ఉన్నదీ తెలిసిపోతుందనీ అన్నారు.

వాళ్ళు ఇలా మాట్లాడుకుంటూ ఉండ గానే అటుగా ఒక పొరుగూరి మోతుబరి వచ్చాడు. గ్రామచావడి వద్ద చేరినవాళ్ళు ఆయనను పిలిచి, "అయ్యా, ఒక చిన్న పరీక్ష జరుగుతున్నది. మీరు ఒక్క క్షణం ఇలా వచ్చి, వీ రిద్దరికీ మీ చెయ్యి చూపండి," అన్నారు.

పొరుగూరి మోతుబరి దగ్గిరికి వచ్చి చెయ్యి చాచాడు. భద్రయ్య అతని చెయ్యి చూసి, "అయ్యా, ఇది పరీక్ష కనక ఉన్న మాట చెప్పక తప్పదు. మీకు ధనం చాలా ఉన్నదిగాని అంతకు మించిన లోభితనం కూడా ఉన్నది. మీ భార్య ఎలా చెబితే అలా నడుచుకుంటారు," అన్నాడు.

మోతుబరి మండిపడి, "అబద్ధాల కూతలతో నన్ను అవమానించటానికేనా పిలి చారు?" అన్నాడు.

రామశాస్త్రి అతనితో, "ఆగ్రహించకండి. కొందరు హస్తసాముద్రికమంతా తమకే తెలుసుననుకుంటారు. మీ చెయ్యి నన్ను కూడా చూడనివ్వండి....,ఈ చెయ్యి లక్ష్మీ పుత్రుడిది. ఈ రేఖలు గొప్ప ఉదారస్వభావాన్ని సూచిస్తున్నాయి. ఎంతటివారైనా ఈ వ్యక్తి ముందు పిల్లుల్లాగా అయిపోతారు. పూర్వజన్మ సుకృతం వల్ల భార్య చాలా అనుకూలవతి!" అన్నాడు.

ఈ మాటలకు మోతుబరి పొంగిపోయి, "శబాష్! నా సంగతంతా దగ్గిరుండి చూసినట్టు చెప్పావు. చెయ్యి చూసి చెబితే అలా చెప్పాలి గాని, యీ రెండో ఆయనలా పుల్ల విరుపుగా మాట్టాడితే ఎలా," అన్నాడు.

రామశాస్త్రి ఆయన చేతిలోకి చూస్తూ, "మీరు నా శాస్త్రజ్ఞానాన్ని మెచ్చుకుని నాకు ఉంగరం బహుమతి ఇవ్వాలనుకుంటున్నారు. మీ దాతృత్వం జగమెరిగినది గదా," అన్నాడు.

ఈ మాటతో మోతుబరి కొయ్యబారిపోయాడు.

రామశాస్త్రి అది చూసి, "కొంపతీసి తప్పు చెప్పానా ఏమిటి? ఎందుకు అలా చూస్తున్నారు?" అని అడిగాడు.

మోతుబరి తమాయించుకుని, "అబ్బే, మరేమీ లేదు. నా మనసులో మాట కూడా ఎలా తెలిసిందా అని ఆశ్చర్యం వేసింది," అని తన వేలిన ఉన్న ఖరీదైన ఉంగరం తీసి రామశాస్త్రికి ఇచ్చి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

అందరూ రామశాస్త్రిని రకరకాలుగా పొగడి, అతను పరీక్షలో గెలిచినట్టు అంగీకరించారు. భద్రయ్య ముఖం ముడుచుకుపోయింది.

రామశాస్త్రి వారితో, "నిజానికి ఈ భద్రయ్యగారు హస్తసాముద్రికంలో చాలా గట్టివాడే. కాని అదే వృత్తిగా గల నాబోటివాడికి శాస్త్రజ్ఞానం చాలదు. సమయస్ఫూర్తి కూడా ఉండాలి. జ్ఞానానికి లౌక్యం తోడు కాకపోతే అర్థంలేని అహంకారం పెరుగుతుంది. అహంకారం అవమానం తెచ్చిపెట్టుతుంది," అన్నాడు.





# మాటతప్పనివాడు

పూర్వం టర్కీదేశంలో అబ్దుల్ హమీద్ అనే వర్తకుడు ఉండేవాడు. ఆయన దగ్గిర ఒక అపూర్వమైన అరేబియాజాతి గుర్రం ఉండేది. ఆయనకు ఆ గుర్రం అంటే చాలా ఇష్టం. కాని వయసు మీరిపోవడం చేత ఆయన దాని మీద స్వారి చెయ్యలేక, దానిని అమ్మెయ్యడానికి నిశ్చయించాడు. దానిని ఆయన మూడు వందల దీనారాలకు అమ్మాలనుకున్నాడు, కాని అంత ధర ఇచ్చి కొనేవారు లేకపోయారు.

ఒకరోజున అజీజ్ అనే యువకుడు అబ్దుల్ హమీద్ వద్దకు వచ్చి, వినయంగా సలాము చేసి, "అయ్యా, నేను ఉన్నత కుటుంబంలో పుట్టినవాణ్ణైనా చాలా బీద వాణ్ణి. మీ గుర్రం మీద నాకు చాలా మక్కువ. అయితే దాని ధర ఇచ్చుకో లేను. మీరు దయతో ఆ గుర్రాన్ని నాకు ఇచ్చినట్టయితే, దూర దేశాలకు పోయి సంపాదన పరుణ్ణి కావాలనుకుంటున్నాను. ఒక సంవత్సరానికి తిరిగి వచ్చి, నేను ఈ లోపుగా సంపాదించినదంతా గుర్రం మూల్యం కింద మీకు ఇచ్చుకుంటాను. ఇందుకు తప్పనని మీకు మాట ఇస్తున్నాను," అన్నాడు.

హమీద్ కొంచెంసేపు ఆలోచించి, "సరే, నువు పెట్టిన షరతు ప్రకారం గుర్రాన్ని తీసుకు వెళ్ళు," అంటూ చెర్నాకోల తెచ్చి అజీజ్ చేతికి ఇచ్చాడు.

అజీజ్ సంతోషంగా ఆ గుర్రాన్ని ఎక్కి తన అదృష్టాన్ని వెతుక్కుంటూ దేశాల వెంట బయలుదేరాడు.

కొంతకాలం ప్రయాణం చేసి అతను ఒక పట్టణం చేరుకున్నాడు. అతను రాజ ప్రాసాదం ముందునుంచి వెడుతూండగా, కిటికీ దగ్గిర నిలబడిన రాజుగారి దృష్టి అజీజ్ ఎక్కిన గుర్రంపై పడింది; ఆ అరే

"మైత్రేయి"



31



బియా జాతి గుర్రం తన వద్ద ఉంటే బాగుండుననిపించింది.

రాజు వెంటనే తన నౌకర్లను అజీజ్ బసచేసి ఉన్న సత్రానికి పంపి, అతన్ని పిలిపించి, "నీ గుర్రాన్ని నేను కొనాలను కుంటున్నాను. దాని వెల ఎంత?" అని అడిగాడు.

అజీజ్‌కు ఆ గుర్రాన్ని అమ్మాలని లేదు. కాని రాజు పిలిపించి అడిగినప్పుడు అమ్మ ననడం భావ్యం కాదు గనక, హమీద్‌కు హెచ్చు సొమ్ము ముట్టజెప్పి సంతోష పెట్టా లన్న ఉద్దేశంతో, "మహారాజా, దీని వెల తొమ్మిదివందల బంగారు దీనారాలు," అని చెప్పాడు.

రాజుకు ఆ ధర భయంకరంగా తోచింది, కాని గుర్రాన్ని వదల బుద్ధి కాలేదు. అందు చేత ఆయన అజీజ్‌తో, "నువు చాలా హెచ్చు ధర చెబుతున్నావు. నన్ను కొంచెం ఆలోచించుకోనియ్యి. రేపు ఉదయం ధర పరిష్కరించుకుందాం," అని అతన్ని పంపేశాడు.

అజీజ్ వెళ్ళిపోయాక రాజు తన మంత్రు లను పిలిచి, ఆ అపూర్వమైన గుర్రాన్ని తక్కువ ధరకు కొనే ఉపాయం చెప్ప మన్నాడు. ఎవరికి తోచిన ఉపాయం వారు చెప్పారు. కాని అవేవీ రాజుకు ఏ మాత్రం నచ్చలేదు.

అప్పుడు ముఖ్యమంత్రి, "మహారాజా, రేపు ఆ యువకుణ్ణి మన ఉపవనంలో కలుసుకునేటప్పుడు రాజకుమార్తెను దగ్గిర ఉంచుకుని, ఆమె ద్వారా కూడా బేరం సాగించండి. అతను తగ్గిరాక ఏం చేస్తాడు? కాకపోయినా, వంట యింటి కుందేలు! గుర్రాన్ని మనం అడిగిన ధరకు యివ్వ కుండా అతను మననుంచి తప్పించుకుని నగరం దాటి ఎక్కడికి పోగలడు?" అని సలహా ఇచ్చాడు.

ఈ సలహా రాజుకు నచ్చింది. ఆయన మర్నాడు ఉదయం అజీజ్‌ను తోటలోకి తీసుకు రమ్మని, తనకన్న ముందుగా తన కుమార్తెను తోటలోకి పంపాడు.

అజీజ్ తన గుర్రం మీద వచ్చేసరికి రాజకుమార్తె తోటలో చలవరాతితిన్నె మీద ఒంటరిగా కూర్చుని ఉన్నది. ఆమెకు అజీజ్ చాలా అందంగా కనిపించాడు. ఆ గుర్రం మీద స్వారి చెయ్యటానికి తన ముసలితండ్రి కన్న అతనే యోగ్యుడని ఆమెకు అనిపించింది.

ఆమె గుర్రాన్ని చూస్తున్న దానిలాగా అతన్ని సమీపించి, "నువు ఈ గుర్రాన్ని చౌకగా అమ్మకపోతే నీ ప్రాణాలకే ప్రమాదం ఉన్నది. అందుచేత తప్పించుకు పారి పోవటం తప్ప నీకు వేరే మార్గం లేదు. నా దగ్గిర ఒక కోటున్నది. దాని నిండా అనేకవేల దీనారాలు కుట్టి ఉన్నాయి. మా నాన్న రాగానే దాహంగా ఉందని అడుగు. నేను వెళ్ళి కోటు తొడుక్కొని మంచి నీరు తెస్తాను. ఆ తరవాత మన మిద్దరమూ గుర్రం మీద ఎక్కడికైనా పారిపోదాం," అన్నది.

ఇంతలో రాజు వచ్చాడు. అజీజ్ తనకు దాహం అవుతున్నదన్నాడు. రాజకుమార్తె నీరు తెస్తానని చెప్పి లోపలికి వెళ్ళి, కోటు ధరించి నీళ్ళతో తిరిగి వచ్చింది. అజీజ్ నీరు అందుకోబోతున్నట్టుగా చేతులు చాచి, రాజకుమార్తెను పట్టుకుని గుర్రం మీద ఎక్కించి, తాను కూడా ఎక్కి, మెరుపు లాగా మాయమయాడు.

రాజు జరిగినది గ్రహించి అతని వెనకగా అశ్విక భటులను పంపాడు గాని వాళ్ళు అజీజ్‌ను అందుకోలేక పోయారు.



అజీజ్ రాజకుమార్తెతో కలిసి అనేక దేశాలు తిరిగాడు. వారికి రోజులు హాయిగా గడిచిపోయాయి.

సంవత్సరం గడువు పూర్తి కావచ్చింది. రానున్న దాన్ని తలుచుకుని అజీజ్ కుంగిపోసాగాడు. అతని విచారం గమనించి రాజకుమార్తె కారణం అడిగింది.

అజీజ్ అబ్దుల్ హమీద్‌తో తాను చేసుకున్న ఒప్పందం గురించి ఆమెకు చెప్పి, "ఈ గుర్రం ద్వారా నేను సంపాదించుకున్నదంతా హమీద్‌కు ఇచ్చేస్తానని ప్రమాణం చేశాను. ఆయన కివ్వవలసిన దానిలో నీ కోటూ, నువూ కూడా ఉన్నారు. కాని నిన్ను విడిచి నేను బతకలేను." అని గోలపెట్టాడు.

రాజకుమారి ఆశ్చర్యంతో, "ఇదేమిటి! నువు నన్ను గెలుచుకున్నావు. నీ మీది ప్రేమచేత నేను నా వాళ్ళనందరినీ విడిచిపెట్టి నీ వెంట వచ్చాను. హమీద్‌కు మన విషయం ఏమీ తెలియదు. కావలిస్తే గుర్రం మూల్యం కింద హమీద్‌కు వెయ్యి దీనారాలు ఇచ్చెయ్యి, సంతోషిస్తాడు." అని సలహా ఇచ్చింది.

కాని అందుకు అజీజ్ ఒప్పుకోలేదు. తమకు ఎంత కష్టమైనాసరే, ఆడినమాట తప్పనని అతను పట్టుపట్టాడు. గడువు లోపల వాళ్ళు హమీద్ ఉన్నచోటికి చేరారు.

అజీజ్ హమీద్‌కు సలాం చేసి, "నేను చాలా దూర దేశాలు తిరిగి వచ్చాను. మీ రిచ్చిన గుర్రం వల్ల ఈ రాజకుమారినీ, బంగారు కాసులు కుట్టిన ఈ కోటూ సంపాదించాను. గుర్రం మూల్యం కింద వీటిని స్వీకరించండి." అన్నాడు.

ఉదారబుద్ధి గల హమీద్‌కు అజీజ్‌ను చూసి ఆదరం కలిగింది; జాలి కూడా వేసింది. ఆయన చిరునవ్వు నవ్వి, "నీ నిజాయితీ మెచ్చదగినది. ఈ కోటు నాకు ఉపయోగపడుతుంది. ఇందులో ఉన్న బంగారం చెరిసగం తీసుకుందాం. గుర్రాన్నీ, రాజకుమార్తెనూ నువే ఉంచుకో." అంటూ అజీజ్‌నూ, రాజకుమార్తెనూ మనసారా దీవించాడు.






# ఒకరోజు రాజు

## 5

హసన్ మాటకు ఖలీఫా ఎంతో సంతోషించి, "హసన్, ఇలాటి స్వార్థరహితమైన స్నేహం నా కెంతో ఇష్టం. ఈక్షణం నుంచీ నిన్ను నా అనుచరుడుగా నియమిస్తున్నాను. నువు నేను తాగేటప్పుడు తోడుంటావు. నా సోదరుడివి. అంతే కాదు, రాజభవనంలో నీకు సంపూర్ణమైన స్వేచ్ఛ ఉన్నది. అనుమతి లేకుండా నువు రావచ్చు పోవచ్చు. రాణీ జుబేదా మందిరం ప్రవేశించటానికి ఎవరికీ అనుమతి లేదు. కాని నీకు నేను అలాటి అనుమతి ఇస్తున్నాను. నేను జుబేదా మందిరంలో ఉండగా ఏ వేళప్పుడైనా సరే నువు యథేచ్ఛగా రావచ్చు," అన్నాడు.

ఖలీఫా హసన్‌కు రాజభవనంలోనే చక్కని బస ఏర్పాటు చేసి, అతనికి పదివేల బంగారు దీనారాలు భరణం అప్పటి కప్పుడే ఇప్పించాడు.

ఇదంతా అయిపోగానే ఖలీఫా హసన్‌ను వదిలి దీవాన్‌కు వెళ్ళిపోయాడు.

అబూ అల్ హసన్ వెంటనే తన ఇంటికి పరిగెత్తిపోయి, తన తల్లితో జరిగినదంతా చెప్పి, ఈ నాటకమంతా ఖలీఫాయే సరదాకు ఆడాడన్నాడు. తాను రోజూ వచ్చి పోతూ ఉంటానని తల్లికి మాట ఇచ్చి అతను రాజభవనానికి తిరిగి వచ్చాడు. ఈసరికి అతని విచిత్రగాథ దేశం నాలుగుమూలలా పాక్కిపోయింది.

ఖలీఫా తన యెడల చూపించే అంతులేని ఆదరంతో హసన్‌కు ఆనందమూ, ఉల్లాసమూ పెరిగాయే గాని తల తిరిగి పోలేదు, అతిశయం రాలేదు. అతను రోజూ తన హాస్యంతోనూ, ఛలోక్తులతోనూ ఖలీఫాను వినోదింపజేసేవాడు; దివాణంలో అందరినీ నవ్వించేవాడు. అతన్ని విడిచి ఉండటం



ఖలీఫాకు కష్టమైనందువల్ల అతను అస్తమానమూ ఖలీఫా భవనంలోనూ, రాణీ జుబేదా భవనంలోనూ ఉండవలిసి వచ్చింది.

ఖలీఫా వెంట హసన్ తన భవనానికి వచ్చినప్పుడల్లా అతని చూపులు తన దాసి అయిన గన్నా మీదనే ఉండటమూ, హసన్ తన కేసి చూసినప్పుడల్లా గన్నా చెక్కిళ్ళు ఎర్రబడటమూ జుబేదా గమనించింది. ఆమె ఒకనాడు ఖలీఫాతో, "గన్నా హసన్‌లు ఒకరినొకరు ప్రేమించుకుంటున్నట్టు మీరు గమనించే ఉండాలి. వాళ్ళకు పెళ్లి ఏర్పాటు చేస్తే ఎలా ఉంటుందంటారు?" అన్నది.

"నేనూ అదే అనుకున్నాను, కాని రాచ కార్యాల ఒత్తిడిలో ఆ మాటే మరిచాను. నేను అతనికి పెళ్ళాన్ని సంపాదించి పెడతానని మాట ఇచ్చానుకూడానూ. గన్నా అతనికి తగిన భార్య అవుతుందనుకుంటాను. ఏమంటారో యిప్పుడే ఇద్దరినీ అడిగి చూదాం," అన్నాడు ఖలీఫా.

రాజదంపతులు గన్నానూ, హసన్‌నూ పిలిపించి, "మీ రిద్దరూ పెళ్ళి చేసుకుంటారా?" అని అడిగారు.

గన్నా జేవురించిన ముఖంతో జుబేదా రాణి కాళ్ళమీద పడి తన సమ్మతి తెలియజేసింది.

హసన్ మటుకు, "మహాప్రభూ, తమ బానిస తమ దయాసముద్రంలో ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు. కాని ఈ అందమైన, తియ్యని పేరు గల పిల్లను తన ఇంటిదాన్ని చేసుకునే ముందు రాణీగారిని ఒక ప్రశ్న అడగగోరుతున్నాడు," అన్నాడు.

"ఏమిటా ప్రశ్న?" అని జుబేదా అడిగింది.

"ఈ పిల్ల అభిరుచులు నా అభిరుచుల లాటివేనేమో కనుక్కోండి. నాకు సరదా అయినవి తాగటమూ, తినటమూ, సంగీతమూ, నృత్యమూ, కవితా మాత్రమే. ఈ పిల్ల అభిరుచులు కూడా అవే అయితే నేను ఈమెను గాఢంగా ప్రేమించగలను. అలా కాకపోతే నేను బ్రహ్మచారిగా ఉండిపోవటమే మంచిది," అన్నాడు హసన్.

జుబేదారాణి గన్నాను," అతను అన్నది విన్నావుగా? దానికి నీ సమాధానం ఏమిటి?" అని అడిగింది.

గన్నా తల ఆడించింది.

ఖలీఫా వెంటనే కాజీని, సాక్షులనూ పిలిపించాడు. వివాహ ఒప్పంద పత్రం రాశారు. ముప్పై రోజులపాటు రాజభవనంలో విందు వినోదాలు సాగాయి. అనంతరం నూతన దంపతులు కాపరం ప్రారంభించారు.

వాళ్ళిద్దరూ తమ కాలమంతా తినటంలోనూ, తాగటంలోనూ, వినోదాలలోనూ గడిపి, తమ దగ్గిర ఉన్న డబ్బును మంచినీరులాగా ఖర్చు చేశారు. దగ్గిర ఉన్న డబ్బు పూర్తిగా ఖర్చు అయింది. ఖలీఫా రాజకీయ వ్యవహారాలలో మునిగి ఉండటం వల్ల హసన్‌కు నియమితమైన ఆదాయం ఏర్పాటు చేయుటం మరిచిపోయాడు. అందుచేత వాళ్ళు అంతులేని అప్పులలో మునిగి పోయారు.

ఈ కష్టం ఇలా ఉంటే, వాళ్ళకు ఖలీఫాను గాని, జుబేదాను గాని యాచించటం ఏ మాత్రమూ ఇష్టం లేకపోయింది. ఇద్దరూ చాలా సేపు తలలు వంచుకుని ఆలోచనలో పడ్డారు. చివరకు హసన్ తలఎత్తి, "మనం డబ్బు వ్యర్థం చేసుకున్నాం. ఖలీఫాను నేను అడగను. జుబేదాను నువు అడగటం



కూడా నాకు ఇష్టం లేదు. నేను మరో మార్గం ఆలోచించాను, గన్నా," అన్నాడు.

గన్నా నిట్టూర్పు విడిచి, "ఏమిటి నీ ఎత్తు? చాతనైతే నేను కూడా తోడ్పడతాను. మనం యాచించనూ లేము, మనం జీవించే పద్ధతి మార్చుకోనూ లేము," అన్నది.

"మరేమీ లేదు....మనం చచ్చిపోవాలి!" అన్నాడు హసన్.

గన్నా భయంతో కెవ్వున అరిచి, "నేను చావను. నువు చావదలిస్తే నా సహాయం లేకుండానే చచ్చిపోవలసి ఉంటుంది," అన్నది.

హసన్ ఈ మాటకు ఆగ్రహించక, "ఓసి, ఆడకూతురా! బతికి ఉండటమే జీవించ

టానికి మార్గమని నాకు బ్రహ్మచారిగా ఉన్నప్పుడే తెలును. నీ మందబుద్ధి చూస్తే నేను బ్రహ్మచారిగా ఉండిపోయినదే మేలేనని రుజువవుతున్నది. నువు అంతగా తొందరపడి జవాబు చెప్పకుండా వివరాలు అడిగి ఉంటే, నేను చెప్పే చావును గురించి నువు ఎంతో సంతోషించేదానివి. మనం నిజంగా చచ్చేకన్న, చచ్చినట్టు నటించితే బంగారం కురుస్తుందని గ్రహించలేవూ?" అన్నాడు.

గన్నా నవ్వి, "అది ఎలా?" అన్నది.

"విను. నేను చచ్చిపోగానే నన్ను బట్టలో చుట్టి, నా కాళ్ళు మక్కాలోని కాబా కేసి ఉండేటట్టు ఈ గదిలోనే పడుకోబెట్టి, నా ముఖం మీద నా తలపాగా పెడతావు. తరవాత కెవ్వున కేకలు పెట్టి, గొల్లున ఏడిచి, బట్టలు చించుకుని, జుట్టు పీక్కుంటున్నట్టు అభినయిస్తావు. నీకు శోకదేవత రూపం పూర్తిగా అమరిన మీదట జుబేదా రాణి దగ్గిరికి పరిగెత్తిపోయి, వెక్కుతూ, మధ్య మధ్య సమయోచితంగా మూర్ఛలు పోతూ, నేను పోయానని చెప్పి, నేలకు ఒరిగిపోయి, ఒక గంటదాకా లేవవు. నీకు వాళ్ళు ఆ గంటసేపూ శైత్యోపచారాలు చేస్తూనే ఉంటారు. ఆ తరవాత మన ఇంటికి బంగారం ప్రవహిస్తూ వస్తుంది," అన్నాడు హసన్.

"అలాటి చావు సులభ సాధ్యమే. నేను నీకు సహాయపడతాను. కాని నేను ఎలా చావాలి?" అని గన్నా అడిగింది.



"అదంతా అల్లా చూస్తాడు. నువు మాత్రం నేను చెప్పినట్టు చెయ్యి. చూసుకో, నే నిప్పుడు చచ్చిపోతున్నాను." అంటూ హసన్ గది మధ్య కాళ్ళుచాచి పడుకున్నాడు.

గన్నా అతని బట్టలు విప్పి, పీనుగు బట్టలో అతన్ని చుట్టి, అతని ముఖం మీద తలపాగా పెట్టి, అతను చెప్పినట్టే అరిచి, కేకలు పెట్టి ఏడ్చి, బట్టలు చించుకుని, జుట్టు చిందరవందర చేసుకుని, బుగ్గలు చీరుకుని, ముఖమంతా పచ్చగా చేసుకుని, జుబేదా వద్దకు వెళ్ళి, నేలమీద చాపచుట్ట లాగా పడిపోయి, గుండెలు తరుగుకు పోయే టట్టు మూలగసాగింది.

గన్నా అవతారం చూస్తూనే ఆమెకు కలిగిన విపత్తు ఎలాటిదో జుబేదా గ్రహించింది. ఆమె ఆ పిల్లను తన ఒడిలోకి తీసుకుని, ఆమెకు స్పృహ తెప్పించే ప్రయత్నాలు చేసింది. గన్నా వెక్కి వెక్కి ఏడుస్తూ, మూలుగుతూ, గుండెలు బాదుకుంటూ అబూ అల్ హసన్ పేరే ఉచ్చరించసాగింది. అతి కష్టం మీద ఆమె జుబేదాకు, తన భర్త కిందటి రాత్రి అజీర్తి వ్యాధితో మరణించాడని చెప్పి, "నాకు చావు తప్ప మరేమీ మిగలలేదు." అంటూ మూర్ఛపోయింది.

అక్కడ ఉన్న స్త్రీ లందరూ రోదనం చేశారు. వాళ్ళు గన్నా కోసమూ, తమకు ఎంతో వినోదం కలిగించిన హసన్ చావు తలుచుకునీ ఏడ్చారు; గన్నాను పన్నీటిలో ముంచెత్తి, ఆమెను పరామర్శించారు.





జుబేదా ఏడ్చినంతసేపు ఏడ్చి, తన సొంత ఖజానా దారును పిలిచి, "పదివేల బంగారు దీనారాలు నా ధనం నుంచి తీసి, వెంటనే గన్నా ఇంటికి చేర్చు. దీని భర్తకు ఉత్తర క్రియలు ఘనంగా జరగాలి," అని ఆజ్ఞాపించింది.

ఖజానాదారు రాణి ఆజ్ఞప్రకారం పదివేల బంగారు దీనారాల మూటను ఒక కొజా వాడి వీపుకు ఎత్తించి, అబూ అల్ హసన్ ఇంటికి పట్టించుకుపోయాడు.

తరవాత ఆమె గన్నాను కౌగలించుకుని ఓదార్చుతూ, "అల్లా నీ కష్టాన్ని తగ్గించాలి. నీ భర్త ఆయువు కూడా పోసుకుని నువు కలకాలం బతుకు," అన్నది.

గన్నా జుబేదా చేతులను తన కన్నీటితో తడిపి, ఆమె వద్ద శలవు పుచ్చుకుని, తన ఇంటికి తిరిగిపోయింది.

ఆమె తన భర్త శవంలాగా కొయ్యబారి పడుకుని ఉన్న గదిలోకి వచ్చి, ఆనందంతో నవ్వుతూ, "హాస్యగాడా, ఇక బతికిరా! ఇవాళ మనకు పస్తుతప్పింది," అన్నది.

అబూ అల్ హసన్ ఏనుగు గుడ్డ తీసి పారేసి, గన్నా సహాయంతో దీనారాల సంచీని గది మధ్యకు ఈడ్చి, ఒంటి కాలి మీద గెంతుతూ నృత్యం చేశాడు.

అతను తన భార్యను అభినందించి, "అప్పుడే అంతా అయిపోలేదు. ఇప్పుడు చావటం నీ వంతు. నువు జుబేదాను మోసగించినంత తేలికగా నేను ఖలీఫాను మోసగించగలనేమో చూడాలి. మోసం చెయ్యటం ఖలీఫా ఒక్కడికే తెలిసిన విద్య కాదని తెలియజెప్పాలి," అన్నాడు.

అతను తాను చుట్టుకున్న ఏనుగు బట్టలోనే గన్నాను చుట్టి, ఆమె కాళ్ళు మక్కా కేసి ఉండేటట్టు పడుకోబెట్టి, ఏం జరిగినా సరే ప్రాణం ఉన్నట్టు బయటపడవద్దని ఆమెను హెచ్చరించాడు. తరవాత అతను ఏడుపు ముఖం పెట్టుకుని, తలపాగా సగం ఊడదీసి, కళ్ళకు ఉల్లిపాయ రుద్ది అమితంగా నీరు కార్చుకుని, బట్టలు చించుకుని, సభ తీరి ఉన్న ఖలీఫా వద్దకు పరిగెత్తాడు.

ఎప్పుడూ ఆనందసముద్రంలో తేలుతూ ఉండే హసన్‌ను శోకమూర్తి రూపంలో చూస్తూనే ఖలీఫా అమితమైన ఆందోళన చెంది, అతనికి ఎదురు వచ్చి, దుఃఖ కారణం ఏమిటని అడిగాడు. హసన్ మరింత గట్టిగా ఏడుస్తూ, వెనక్కూ ముందుకూ తూలుతూ, "అయ్యో, గన్నా! గన్నా! నా గతి ఏంగాను?" అంటూ ముఖానికి చేతిగుడ్డ అడ్డం పెట్టుకుని ఏడవసాగాడు.

గన్నా చనిపోయిన వార్త వినపడు తుందని గ్రహించి ఖలీఫా చలించిపోయాడు. ఆయన కళ్ళ వెంట నీళ్ళు వచ్చాయి. ఆయన హసన్ భుజాల మీద చేతులు వేసి, "తమ్ముడూ, అల్లా నిన్ను కనికరించాలి. గన్నా నుంచి తీసుకున్న ఆయువు నీకిస్తాడు. ఆమె నిన్ను ఆనందంలో ముంచి ఎత్తు తుందనుకుని నీకిచ్చి చేస్తే నిన్ను దుఃఖ సముద్రంలో ముంచిందే! పాపం, గన్నా!" అంటూ వేడి కన్నీరు కార్చాడు.

ఖలీఫాతోబాటు జఫర్ మొదలైన వారు కూడా ఏడ్చారు.

తరవాత ఖలీఫా తన ఖజానాదారును పిలిచి, "ఈ హసన్ వెంట పదివేల దీనారా లిచ్చి పంపించు. ఇతను తన భార్యకు ఘనంగా ఉత్తర క్రియలు జరుపుకుంటాడు," అన్నాడు.

ఖజానాదారు ధనం సిద్ధం చేస్తూ ఉండగా హసన్ ఖలీఫా చేతిని ముద్దు పెట్టుకుని, భోరున ఏడుస్తూ శలవు తీసు కున్నాడు. అతను ఇంటికి వచ్చి, పీనుగు






లాగా పడుకుని ఉన్న గన్నాతో, "ప్రతి కన్నీటి చుక్కకూ ఒక దీనారం సంపాదించే విద్య నీకే ఉందనుకున్నావా? ఈ మూట చూడు!" అంటూ గన్నాను చుట్టిన గుడ్డ విప్పేసి, "ఇంతటితో అయిపోలేదు. ఇందుకుగాను మనం ఖలీఫా ఆగ్రహానికీ, జుబేదా ఆగ్రహానికీ గురికాకుండా చూసుకో వలసి ఉన్నది," అన్నాడు. అందుకై తాము ఏమి చెయ్యవలసినదీ అతను గన్నాకు చెప్పాడు.

ఖలీఫా ఆ రోజు సభ త్వరగా చాలించి జుబేదా మందిరానికి వెళ్ళి, జుబేదా తన పరిచారికను పోగొట్టుకున్నందుకు పరామర్శించబోయాడు. అదే సమయంలో జుబేదా, హసన్‌ను కోల్పోయినందుకు ఖలీఫాను పరామర్శించింది.

ఖలీఫా నవ్వి, తన వెంటనున్న మస్రూర్‌తో, "రాణిగారు పొరబడుతున్నారు. నిజం చెప్పు," అన్నాడు.

మస్రూర్ జుబేదాతో, "అవును, మహారాణీ. అబూ అల్ హసన్‌కు ఏ ప్రమాదమూ లేదు. పిడిరాయిలా ఉన్నాడు. పోయినది అతని భార్య," అని చెప్పాడు. గన్నా ఉత్తర క్రియలకుగాను పదివేల దీనారాలను ఇచ్చి ఇంతకు ముందే హసన్‌ను ఖలీఫా పంపాడని విని, జుబేదా, "అబూ అల్ హసన్ ఉత్తర క్రియలకుగాను నేను ఎంత డబ్బు పంపానో నా ఖజానాదారును అడగండి," అన్నది.

పోయినది గన్నా అనీ, కాదు హసన్ అనీ భార్యా భర్తలు కొంతసేపు వాదించుకున్న మీదట ఖలీఫా మస్రూర్‌తో, "నువు హసన్ ఇంటికి వెళ్ళి ఎవరు పోయారో చూసిరా," అన్నాడు. అతను తిరిగి వచ్చే లోపుగా భార్యా భర్తలు పందాలు కూడా కాశారు.

ఎవరైనా వస్తారని కనిపెట్టి ఉండిన హసన్ మస్రూర్‌ను దూరాన చూస్తూనే, "గన్నా, ఖలీఫా పంపగా మస్రూర్ నిజం తెలుసుకోవటానికి వస్తున్నాడు. వెంటనే చచ్చిపో," అన్నాడు.

మన్సూర్ వచ్చేసరికి గన్నా గది మధ్య శవం లాగా పడుకుని ఉన్నది. ముఖానికి గుడ్డ అడ్డం పెట్టుకుని ఏడుస్తూ హసన్ ఆమె దగ్గిర కూర్చుని ఉన్నాడు. మన్సూర్ ఆ దృశ్యం చూసి, గన్నా కోసం కాసిని కన్నీళ్ళుకార్చి, శలవు పుచ్చుకుని తిరిగి వెళ్ళి, జుబేదారాణి పొరబడిందని చెప్పాడు.

ఖలీఫా సంతోషించి, "రాణీ, నువు పందెం పోగొట్టుకున్నావు," అన్నాడు.

జుబేదా మండిపడి, "ఈ మన్సూర్ అబద్ధాలమారి! గన్నా ఏడుస్తూ రావటం నా దాసీలందరూ చూశారు. నా మాట అబద్ధం చెయ్యటానికి మీ రింత కుట్ర పన్నటం ఏమీ బాగా లేదు. నేను కూడా ఇప్పుడే ఎవరినన్నా పంపి నిజం బయట పెడతాను. నా మాట నిజమైతే ఈ మన్సూర్ గాడి తల తీసెయ్యాలి," అన్నది.

ఆమె తన ముసలి దాదిని నిజం తెలుసుకు రమ్మని గన్నా ఇంటికి పంపింది.

ఎవరు ఈసారి వస్తారోనని కనిపెట్టి చూస్తున్న హసన్, ఆ దాదిని దూరాన చూసి, "గన్నా, నేను చచ్చాను," అన్నాడు.

దాది లోపలికి వచ్చేసరికి హసన్ శవం వద్ద కూర్చుని గన్నా ఏడుస్తున్నది. దాది ఆమెను తగిన విధంగా ఓదార్చి, తిరిగి వెళ్ళి, పోయినది గన్నా భర్తేనని చెప్పింది. వెంటనే జుబేదా విజయగర్వంతో, మన్సూర్ తల తీయించమని ఖలీఫాను అడిగింది.

"మన్సూర్ అబద్ధమాడితే నేను అబద్ధమాడినవాణ్ణే. నిజం తెలుసుకోవాలంటే



మనిద్దరమూ హసన్ ఇంటికి పోవాలి. బయలు దేరు," అన్నాడు ఖలీఫా.

జుబేదా ఖలీఫాల వెంట ఒక పటాలం బయలుదేరింది.

ఇలా జరగవచ్చునని ముందే ఊహిం చిన హసన్ గన్నాతో, "ఇద్దరమూ చచ్చి పోదాం," అన్నాడు.

ఖలీఫా మొదలైన వాళ్ళు లోపలికి వచ్చే సరికి రెండు శవాలు కనిపించాయి. వచ్చిన వాళ్ళు వాటిని చూసి కొయ్యబారి పోయారు.

"కాని ఎవరు ముందు పోయినదీ తెలి యటం ఎలా?" అన్నది జుబేదా.

"ఆ సంగతి చెప్పినవాళ్ళకు పదివేల దీనారాలిస్తాను," అన్నాడు ఖలీఫా.

"నాకివ్వండి. ముందు నేనే పోయాను," అన్నాడు హసన్ గుడ్డ చుట్టలో నుంచి.

శవం నుంచి మాటలు రావటం విని జుబేదా హడలిపోయింది. కాని నిజం పసి గట్టిన ఖలీఫా గది మధ్య చతికిలబడి వెర్రిగా నవ్వుతూ, "లేదురా, హసన్! నవ్వ లేక చస్తున్నది నేను!" అన్నాడు.

ఖలీఫా నవ్వు సంబాళించుకునేసరికి హసన్, గన్నా లేచి కూర్చున్నారు. హసన్ ఖలీఫా కాళ్ళ మీద పడ్డాడు. గన్నా జుబేదా కాళ్ళ మీద పడింది. ఇద్దరూ క్షమాపణలు వేడుకున్నారు.

హసన్ ఖలీఫాతో, "ప్రభూ, బ్రహ్మ చారిగా ఉండగా నాకు డబ్బు మీద నిర్లక్ష్యం ఉండేది. కాని ఈ గన్నా ఎంత బంగార మైనా సంచులతో సహా తినెయ్యగలదు. అవకాశం ఉంటే ఏలినవారి ఖజానానూ, ఖజానాదారునూ కూడా తినేస్తుంది," అన్నాడు.

ఖలీఫా జుబేదాలు వారిని క్షమించి వాళ్ళకు చెరొక పదివేల దీనారాలూ అద నంగా ఇచ్చారు.

హసన్‌కు గల అవసరాన్ని ఖలీఫా గుర్తించి, అతనికి జఫర్‌తో సమంగా జీతం ఏర్పాటు చేశాడు. అటుతరవాత హసన్ గన్నాలు ఏ లోటూ లేకుండా, సుఖంగానూ, సంతోషంగానూ జీవించారు.

— (అయిపోయింది)





# బంగారుపక్షి గుడ్డు

సుందరవనంలో ఒక పెద్ద మామిడిచెట్టు కొమ్మ మీద ఒక గుడ్లగూబ కూర్చుని ఉన్నది. వెన్నెలలో అరణ్యం అంతా చాలా అందంగా ఉన్నది. ఆ అందాన్ని చూసి ఆనందించే గుడ్లగూబకు దిగువన ఏదో అలికిడి వినిపించింది. కిందికి చూసే సరికి ఒక బ్రహ్మాండమైన సర్పం, నోట ఒక పక్షిగుడ్డును పట్టుకుని, చెట్టు మొదలు దగ్గిరికి పాకుతూవచ్చి, ఆ గుడ్డును ఒక తొర్రలో ఉంచి తన దారిన తాను వెళ్ళిపోయింది.

ఆ రాత్రి గడవనిచ్చి గుడ్లగూబ కిందికి వెళ్ళిచూస్తే, గుడ్డు నుంచి పిల్ల ఒకటి బయటికి వచ్చి ఉన్నది. దాని ఈకలు బంగారంలో మెరిసిపోతున్నాయి.

గుడ్లగూబ ఆ పిల్లను చూసి జాలిపడి, తన గూటికి చేర్చి, ఎంతో ప్రేమతో పెంచి పెద్ద చేసింది. రెండు నెలలకల్లా అది అతి లోకసుందరమైన బంగారుపక్షిగా తయారయింది.

బంగారుపక్షిని పెళ్ళాడతామని అరణ్యంలోని అనేక పక్షులు ఆరాటపడ్డాయి. కాని బంగారుపక్షి అన్నిటినీ నిరాకరించింది.

సుందరవనంలోని పక్షులకు రాజు రెండు తలల వింతపక్షి. అతని రాణి ఒక ఆడ నెమలి. ఆ నెమలికి తనంత అందమైన పక్షి మరేదీలేదని చాలా నిక్కు ఉండేది. బంగారుపక్షి అందం గురించి విని ఆ నెమలి రాణికి అసూయ కలిగింది. ఆ నెమలి కృత్రిమంగా అలంకరణలు చేసుకుని బంగారుపక్షిని చూడబోయింది. ఆ అలంకరణలను చూసి బంగారుపక్షి పగలబడి నవ్వింది. అది పక్షులరాణి అని బంగారుపక్షి ఎరగదు.

బంగారుపక్షిని కళ్ళారా చూశాక నెమలి రాణి అసూయ మరింత అయింది. అది

---

తనను చూసి నవ్వినందుకు ఆ అసూయకు ద్వేషం తోడు అయింది. ఆ అసూయా ద్వేషాలతో నెమలిరాణి, బంగారుపక్షికి ఒక మాలకాకితో పెళ్ళి జరగాలని ఉత్తరువు ఇచ్చింది. అలాగే బంగారుపక్షికీ, మాల కాకికీ వివాహం జరిగింది. ఆ రెండూ ఒక చెట్టు మీద కాపరం పెట్టాయి.

ఇంత చేసినా నెమలిరాణి కచ్చ తీరలేదు. బంగారుపక్షీ, మాలకాకీ సుఖంగా జీవిస్తు న్నట్టు తెలుసుకుని, వాటికి ఆ సుఖం కూడా లేకుండా చెయ్యాలని నిశ్చయించుకుని, నెమలిరాణి తన భర్త వద్దకు వెళ్ళి, "నువు రోజు రోజుకూ క్షీణించిపోతున్నావు. ఇలా అయితే త్వరలో వృద్ధాప్యం వచ్చేస్తుంది. రోజూ బంగారుపక్షి గుడ్డు తింటే యౌవనం నిలుస్తుంది. త్వరలోనే బంగారుపక్షి మొదటి గుడ్డు పెట్టబోతున్నది. భటులను బంగారుపక్షి గూటికి కాపు పెట్టి, అది పెట్టే గుడ్లను ఎప్పటికప్పుడు తెప్పించి తిను." అని సలహా ఇచ్చింది.

పక్షిరాజు వెంటనే తన భటులకు ఉత్తరువులిచ్చాడు. భటులు బంగారుపక్షి గూటి వద్ద కాపలా కాసి, అది గుడ్డు పెట్టి నప్పుడల్లా తీసుకుపోయి రాజుకు ఇవ్వ సాగారు. రాజాజ్ఞ గనక బంగారుపక్షి ఏమీ చెయ్యలేక పోయింది. పక్షి దంపతులు అరణ్యం వదలి పారిపోవాలనుకున్నప్పటికీ అది సాధ్యం కాలేదు; నెమలిరాణి ఆ పక్షులు పారిపోకుండా చూడటానికి యాభై గద్దలను కాపు పెట్టింది.



ఇలా ఉండగా ఒకనాడు గుడ్లగూబ బంగారుపక్షిని చూడ వచ్చి సంగతి అంతా తెలుసుకుని, ఈ ఆపద తొలగించే ఉపాయం చేస్తానని మాట ఇచ్చింది.

గుడ్లగూబ పక్షివైద్యం తెలిసినది. అది పక్షిరాజుకు లోగడ కొన్ని చికిత్సలు చేసి, మన్నన పొంది ఉన్నది. రాజు మనసు మార్చాలంటే, రాణినెమలి దగ్గిర ఉండగా అది సాధ్యం కాదు. అందుచేత ఏదో ఒక ఉపాయంతో రాణి నెమలిని దూరంగా పంపెయ్యాలి.

ఆ ప్రయత్నంలో గుడ్లగూబ పరొక అరణ్యానికి వెళ్ళి, అక్కడ ఉంటున్న రాణినెమలి తల్లిదండ్రుల కోసం ఒక గొప్ప విందు చేసి, ఆ సమయంలో వారి ఆహారంలో రహస్యంగా ఏదో మందుపెట్టి వారికి రోగం తెప్పించింది.

వెంటనే ఆ వార్త రాణినెమలికి అందింది. రాణి రాజుతో సంగతి సందర్భాలు చెప్పి, జబ్బుగా ఉన్న తన తల్లిదండ్రులను చూడ బోయింది.

మర్నాడు ఉదయం గుడ్లగూబ పక్షిరాజు వద్దకు వెళ్ళేసరికి, రాజుపక్షి బంగారుపక్షి గుడ్డును తినబోతున్నది.

" మహారాజా, తొందరపడి ఆ గుడ్డును తిసవద్దు. అది తాజా గుడ్డు కాదు. చాలా పాతదో, బాగాకుళ్ళినదో అని తోస్తున్నది," అన్నది గుడ్లగూబ.

" ఇది నిన్నరాత్రి పెట్టిన గుడ్డే !" అన్నది రాజుపక్షి.



"ఎందుకైనా మంచిది. దాన్ని ఈ నీళ్ళ గ్లాసులో వెయ్యండి. తాజా గుడ్డు అయితే మునుగుతుంది. కాకపోతే తేలుతుంది," అన్నది గుడ్లగూబ.

"నాకు తెలుసు," అంటూ రాజుపక్షి బంగారుపక్షి గుడ్డును గుడ్లగూబ వేయమన్న నీళ్ళ గ్లాసులో వేసింది. ఆ గుడ్డు నీటిలో మునగక తేలింది.

"ఛీ, ఛీ! నువు చెప్పిన మాట నిజమే. దీన్ని తీసుకుపోయి పారెయ్యి," అన్నది రాజుపక్షి.

గుడ్లగూబ ఆ గుడ్డును తీసుకుపోయి బంగారుపక్షికి ఇచ్చింది. బంగారుపక్షి ఎంతగానో ఆశ్చర్యపడిపోతూ, "దీన్ని రాజుపక్షి వాతనుంచి ఎలా కాపాడావు?" అని అడిగింది.

గుడ్లగూబ నవ్వుతూ, "చిన్న తమాషా చేశాను. పారింది. ఈ తమాషా ఎవరో కుర్రాడు చెయ్యగా ఒకసారి చూశాను. ఆ కుర్రవాడు మంచి నీటిలో గుడ్డు వేసేవాడు. అది మునిగేది. తరవాత దాన్ని తీసి ఆ మంచి నీటిలో ఉప్పు బాగా కలిపిన నీరు పోసి, మంత్రం చదివినట్టు నటిస్తూ గుడ్డును మళ్ళీ వేసేవాడు. గుడ్డు అందులో తేలేది. నేను రాజుపక్షి ముందు ఉప్పు నీటిలో ఈ గుడ్డు వేసి తేల్చి చూపాను. గుడ్డు చెడిపోయిందని రాజు నమ్మాడు. అంతే!" అన్నది.

ఆ గుడ్డు బంగారుపక్షి గూటిలో పిల్ల కావటం క్షేమం కాదు గనక, గుడ్లగూబ దాన్ని తన గూటికి తీసుకుపోయి, అక్కడ పొదిగి, పిల్లను చేసి, ఒక రాత్రి దానితో సహా దూరంగావున్న మరొక అరణ్యానికి ఎగిరిపోయింది.

నెమలిరాణి తన తల్లిదండ్రులను చూసి తిరిగి వస్తూండగా ఎవడో వేటగాడు బాణంతో కొట్టి చంపేశాడు. తరవాత కొంతకాలానికి రాజుపక్షి కూడా పోవటంతో బంగారుపక్షికీ, దాని భర్త అయిన మాలకాకికీ విముక్తి లభించింది. అవి ఎగిరిపోయి, తమ పిల్ల గుడ్లగూబ వద్ద పెరుగుతున్న అరణ్యానికి చేరుకుని, సుఖంగా ఉండిపోయాయి.





# ఏనుగుల పంచాయతీ

ఆఫ్రికాలో పెద్ద సరస్సు ఉత్తరతీరాన రామోగి అనే ముసలివాడు తన ఏడుగురు కొడుకులతోనూ, వాళ్ళ పెళ్ళాలతోనూ, పిల్లలతోనూ జీవించేవాడు. వాళ్ళ గుడిసెలన్నీ కలిసి ఒక గ్రామంలాగా ఉండేది.

రామోగి చనిపోగానే ఆ ప్రదేశం పెద్ద కొడుకుది అయింది. మిగిలిన ఆరుగురు కొడుకులూ తమ తమ కుటుంబాలతో మరెక్కడికైనా వెళ్ళి, నివాసాలు ఏర్పాటు చేసుకోవలిసి వచ్చింది.

వారిలో ఆఖరు వాళ్ళిద్దరూ పోథూ, అరువా అనేవాళ్ళు చిన్నతనం నుంచీ విడరాని జంటగా ఉండేవాళ్ళు. చిన్నప్పుడు ఒకేచోట పడుకునే వాళ్ళు. కలిసి తిరిగే వాళ్ళు. ఒకరు ప్రారంభించిన మాట రెండో వాళ్ళు పూర్తి చేసేవాళ్ళు. చివరకు పెళ్ళి చేసుకునేటప్పుడు కూడా వాళ్ళు అప్పచెల్లెళ్ళను పెళ్ళాడారు.

అంత అన్యోన్యంగా ఉండటం చేత వాళ్ళు వేరే ఎక్కడికన్నా పోయేటప్పుడు ఒకేచోట నివాసం ఏర్పాటు చేసుకుని, కలిసి జీవిద్దామనుకున్నారు. ఇది ఆచార విరుద్ధమైనా వాళ్ళు లెక్కచెయ్యలేదు.

ఆ నివాసం ఎక్కడ ఏర్పాటు చేసుకోవాలన్న సమస్య వచ్చింది. రామోగీ బలగం నివసించిన ప్రదేశానికి తూర్పుగా ఒక మహారణ్యం ఉన్నది. దానికి సమీపంగా నివాసం ఏర్పాటు చేసుకుని, అక్కడే వ్యవసాయం చేసుకుందామని ఆ అన్నదమ్ములు అనుకున్నారు.

ఇది చాలా సాహసంతో కూడిన పని. అందుకు చాలా కారణాలున్నాయి. అది అంతూ పొంతూ లేని కీకారణ్యం. అది మంత్రారణ్య మనీ, అందులోకి మనుషులు పోతే ఏ తొండ గానో, మరో జంతువుగానో మారిపోతారనీ ఆ ప్రాంతం వారికి హడలు.

---

ఆఫ్రికా జానపద కథ

---




అటుకేసి ఎవరూ వెళ్ళరు. అదీకాక అందులో ఏనుగులుంటాయి. ఆ ప్రాంతాల వాళ్ళు వాటికి మంత్రశక్తు లున్నాయనుకుంటారు, వాటిని చూసి భయపడతారు.

అలాటి మహారణ్యం అంచున పోధూ, అరువా ఇల్లు కట్టుకుని, జొన్నపంట వేశారు. కంకులుపడి చేను ఏపుమీద ఉన్నది.

ఆ తరుణంలో ఒకనాడు అరువా పశువులను తోలుకుని బయటికి వెళ్ళాడు. పోధూ మాత్రం బద్ధకంగా పక్కమీదే ఉన్నాడు. అంతలో "ఏనుగులు!" అని పిల్లలు కేకపెట్టటం వినిపించింది. పోధూ చివాలున లేచి, చప్పున ఈటె ఒకటి తీసి బయటికి పరిగెత్తాడు.

ఒక పెద్ద ఏనుగుల మంద జొన్నపొలమంతా మట్టగించేస్తూ, తొండాలతో పైరు పీకి తినేస్తున్నది. పోధూ అరణ్యం అంచుకు వెళ్ళి గట్టిగా అరిచాడు. వెంటనే ఏనుగులన్నీ ఎక్కడివక్కడ చలనంమాని నిలబడి వాడి కేసి చూశాయి.

పోధూ తన చేతిలో ఉన్న ఈటెను ఏనుగులలో కెల్లా పెద్దదాని కేసి బలంగా విసిరాడు. అది ఆ ఏనుగు డొక్కలో దిగబడింది. ఆ ఏనుగు కోపంతోనూ, బాధతోనూ ఘీంకరించింది. తరవాత, కూడబలుకుకున్నట్టుగా ఏనుగులన్నీ అరణ్యంలోకి వెళ్ళిపోయాయి. వాటి అలికిడి అంతకంతకూ దూరమై, చివరకు వినపడకుండా పోయింది.

ఈ సంఘటనలో పోధూ వల్ల ఒక పెద్ద నేరం జరిగిపోయింది. అతను ఏనుగు మీద విసిరిన ఈటె సామాన్యమైన ఈటె కాదు. రామోగీ వంశంలో అది అనాదిగా ఉంటున్నది. ఏ యుగంలోనో నందిజాతివాళ్ళు దాన్ని తయారుచేశారట. దానికి మంత్రశక్తులున్నాయనుకునేవాళ్ళు. రామోగీ తన అవసరానికి ఎన్నో ఈటెలు వాడాడుగాని దాన్ని మటుకు వాడలేదు. ఆయన తన వస్తువులలో ఒక్కొక్కదాన్ని ఒక్కొక్క కొడుక్కు ఇస్తూ ఈ ఈటెను అరువాకు ఇచ్చాడు. అరువా దాన్ని ప్రాణప్రదంగా చూసు

కుంటున్నాడు. తొందరలో పోధూ ఆ ఈటెను తీసుకుపోయి ఏనుగు మీద విసిరాడు. అది ఏనుగుతోబాటే మహారణ్యం లోకి వెళ్ళిపోయింది.

అరువా పశువులను తోలుకుని ఇంటికి వచ్చి, తన ఈటె ఎలా పోయిందీ తెలుసు కుని పట్టరాని కోపంతో, "నా ఈటెను నాకు తెచ్చి ఇయ్యి," అని పోధూను అడిగాడు.

"అరువా, నీ ఈటె ఏనుగుతోబాటు మంత్రాల మహారణ్యం మధ్యకు వెళ్ళి పోయింది. ఎలా వస్తుంది? దానికి బదులుగా అంతకన్న మంచి ఈటెలు కావలిసినన్ని కొని ఇస్తాను," అన్నాడు పోధూ.

"నాకు నా ఈటే కావాలి. దాన్ని తెచ్చి ఇవ్వకపోతే నిన్ను చంపేస్తాను!" అన్నాడు అరువా.

"సరే. నీ ఈటె తెస్తాను. లేదా, ఆ ప్రయత్నంలో చస్తాను," అన్నాడు పోధూ.

మర్నాడు ఉదయం ఎవరూ నిద్రలేవక ముందే పోధూ లేచి, ఒక ఈటె చేతపట్టు కుని, తోలుసంచీ భుజానికి తగిలించుకుని, అరణ్యంలోకి ప్రవేశించాడు. అరణ్యం లోపల చల్లగానూ, తేమగానూ, మసక వెలుగుగానూ ఉన్నది. అతను అరణ్య మృగాల బాటలవెంట అరణ్యం లోపలికి పగలల్లా నడిచాడు, కాని ఏనుగుల జాడ తగలలేదు.



కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి కమ్ముకున్న తరవాత అతను ఒక మహా వృక్షం వేళ్ళసందున తొర్రలో చేరి, తాను తెచ్చుకున్న జొన్నరొట్టె తిని, అక్కడే నిద్రపోయాడు. మళ్ళీ తెల్లవారిన జాడలు కనిపించగానే అతను మళ్ళీ నడకసాగించి, చాలా సేపటికి చెట్లమధ్య చిన్న ఖాళీస్థలం చేరాడు. అక్కడ బాగా పాతగిలిపోయిన ఒక చిన్న గుడిసె ఉన్నది. అందులో నుంచి పొగ వస్తున్నది.

పోధూ చూస్తూండగానే గుడిసెలో నుంచి ఒక ముసలిది గొడ్డలి పట్టుకుని బయటికి వచ్చి, ఎండు కట్టెలు పేళ్ళువేస్తూ, "ఈ వయసులో నాకు చేదోడు లేకపోవటం



చేత ఏమి అగచాట్లు వచ్చాయి!" అని గొణుక్కున్నది.

పోధా ఆమెను సమీపించి, "నేను పేళ్ళు కొట్టి పెడతానమ్మా," అంటూ ఆమె చేతిలోని గొడ్డలి తీసుకుని, త్వరలోనే పెద్ద పేళ్ళకుప్ప తయారుచేశాడు.

ముసలిది వికవికా నవ్వుతూ, "భలే వాడివి, నాయనా! మనుషులుండే చోటు వదిలి ఇంతదూరం ఎలా వచ్చావు?" అని అడిగింది.

పోధా తన కథ అంతా ఆమెకు చెప్పాడు.

అంతా విని ఆమె, "ఇలాటి పని మీద ఇక్కడికి రావటం చాలా సాహసమే. నేను నీకు సహాయపడగలనో, లేదో తరవాత చూద్దాం. ప్రస్తుతానికి నువు కట్టెలు కొట్టి పెడుతూ నా దగ్గిరే ఉండు," అన్నది.

అతను ఒక నెలపాటు ఆమె వెంటే ఉన్నాడు. రోజల్లా కట్టెలు కొడుతూనే ఉండేవాడు. రోజల్లా ముసలిది అతన్ని ఏదో ఒకటి అంటూనే ఉండేది. మధ్య మధ్య, సోమరి వెధవ అనీ, పనికిమాలిన వాడనీ తిట్టుతూ ఉండేది.

తనకు ముసలిదాని వల్ల ఎలాటి ఉపకారమూ జరగదని పోధా నిరాశ చేసేసు కున్నాడు. అలాటి సమయంలో ఆమె అతన్ని తన పక్కన కూచోమని, "ఇన్నాళ్ళూ ఇక్కడ వృథాగా గడిపానని అనుకోకు. ధైర్యమూ, ఓర్పూ, మంచి తనమూ—ఈ మూడూ ఉంటేనేగాని నువు ఏనుగుల దగ్గిర పని సాధించుకోలేవు. నీలో ఆ గుణాలు ఉన్నాయో లేదో చూశాను. నువు ఒక ఏనుగుకు అపచారం కూడా చేసి ఉన్నావు. ఏనుగులు తమకు జరిగిన అపకారాన్ని మరిచిపోవు. అందుచేత నీకు సహాయంగా ఉండగలందులకు ఒక చిన్న వస్తువు ఇస్తాను," అని, నీలం రంగులో వున్న ఒక చిన్న గాజుపూస ఇచ్చింది.

మర్నాడు ఉదయం ఆమె అతనికి ఒక దారి చూపి, ఆ దారిన ఎలా వెళితే ఏనుగు లుండే చోటు వస్తుందో చెప్పింది.

ఆమె చెప్పిన ప్రకారమే నడుస్తూ పోధూ నాలుగు గంటల కాలంలో ఏనుగులుండే చోటికి వెళ్ళాడు. అరణ్యం మధ్య చాలా విశాలమైన మైదానంలో ఏనుగులు ఉంటు న్నాయి. ఆ మైదానం చుట్టూ ప్రహరీ గోడ లాగా, పెకలించిన మహావృక్షాలు ఒకదాని మీద ఒకటి ఎత్తుగా పేర్చి ఉన్నాయి.

ఆ ఆవరణలో కొన్నివేల ఏనుగులు, చిన్నవీ, పెద్దవీ, మగవీ, ఆడవీ ఉన్నట్టు పోధూకు తోచింది. వాటి మధ్య చిన్న కొండలాగా ఒక ముసలి మగ ఏనుగు ఉన్నది. అది ఏనుగుల రాజై ఉండాలి.

పోధూ ఏనుగుల రాజుకు దగ్గిరలో, తల వంచుకుని నిలబడి, వణకసాగాడు.

ఏనుగుల రాజు ఏదో అన్నది. "నువు ఎందుకు వచ్చావు?" అని అది అడిగినట్టు పోధూకు తోచింది. అతను ధైర్యంగా తల ఎత్తి, అన్ని ఏనుగులకూ వినిపించేలాగు, "ఏనుగులారా, మీరు నా పొలంలో మేయ టానికి వచ్చినప్పుడు నేను మీపట్ల నిర్ద యగా ప్రవర్తించాను. నా సోదరుడి ఈటెను మీలో ఒకరి మీద విసిరాను. అది మీ వెంట వచ్చేసింది. ఆ ఈటె తెచ్చి ఇయ్యకపోతే నా సోదరుడు నన్ను చంపుతానంటున్నాడు. అందుకే ఇలా వచ్చాను. ఆ ఈటెను నాకు తిరిగి ఇచ్చినా సరే, మీరే నన్ను చంపినా సరే," అన్నాడు.




చాలాసేపు ఏనుగులు ఏ ధ్వనీ చెయ్య లేదు. తరవాత ఏనుగుల రాజు ఏదో ధ్వని చేసింది. మిగిలిన ఏనుగులు గొణిగాయి. రెండు ఏనుగులు పోధూను దూరంగా ఒక చెట్టునీడకు తీసుకుపోయాయి.

అప్పుడు ఏనుగుల పంచాయతీ జరి గింది. చర్చ ఎంతకూ తేలలేదు. మధ్య మధ్య ఘీంకారాలు వినిపించాయి. చివ రకు పంచాయతీ ముగిసినట్టున్నది. అతన్ని ఏనుగులు మళ్ళీ తమ రాజున్నచోటికి తీసుకుపోయాయి. ఏనుగుల రాజు మళ్ళీ ఏదో అన్నది.

ఏనుగులు పోధూను ఒక చెట్టు వెనక్కు తీసుకుపోయాయి. అక్కడ అనేక ఈటె

లున్నాయి. పోథూ తాను విసిరిన ఈటెను గుర్తించి తీసుకుని, ఏనుగులకు తలవంచి నమస్కారం చేసి, తన కృతజ్ఞత చెప్పు కుని, తిరుగు ప్రయాణమయాడు.

తిరిగివచ్చేటప్పుడు దారి తప్పాడో ఏమో గాని, అతనికి ముసలిదాని గుడిసె తగల లేదు. ఆమె ఇచ్చిన నీలంరంగు పూస అతని వద్దనే ఉండిపోయింది. దారి తప్పిన కారణంగా అతను తన ఇంటికి చేరటానికి మూడు రోజులు పట్టింది.

తన ఈటె తనకు తిరిగివచ్చినందుకు అరువా చాలా సంతోషించాడు. పోథూ తన వింత అనుభవం అందరికీ చెప్పి, తన దగ్గిర ఉన్న పూసను చూపాడు. దాన్ని ఒకరొకరే తీసుకుని, పరీక్షించి, ఆశ్చ ర్యమూ, ఆనందమూ ప్రకటించారు. తర వాత అది పిల్లల చేతులు మారేటప్పుడు అరువా కొడుకు, పసివాడు, దాన్ని నోట్లో వేసుకుని మింగేశాడు.

దానితో సంచలనం ఆరంభమయింది. పోథూ భార్య ఆ కుర్రవాణ్ణి నాలుగు వేసింది. అరువా భార్య తన అక్క అని కూడా చూడక ఆమెను నానా మాటలూ అన్నది.

పోథూ అరువాతో, "తమ్ముడూ, నేను నీ ఈటెను పోగొట్టినప్పుడు, దాన్ని తీసుకు రాకపోతే చంపుతానన్నావు. నా ప్రాణం ఒడ్డి దాన్ని తెచ్చాను. ఇప్పుడు నా మంత్రపు పూసను నీ కొడుకు మింగాడు. ఇప్పుడు నువు ఏం చెయ్యబోతున్నావు?" అన్నాడు.

"రేపు నేను వేరే వెళ్ళిపోతాను. కుక్కలూ, పిల్లులూ కలిసి ఉండగలవు గాని అన్నదమ్ములు కలిసి ఉండలేరని మనవాళ్ళు సామెత చెప్పనే చెప్పారు. నా ఇల్లు వేరే కట్టుకుంటాను," అన్నాడు అరువా.

"అలాగే చెయ్యి. కాని నా పూస మింగిన నీ చంటివాణ్ణి మాత్రం నా కిచ్చెయ్యి," అన్నాడు పోథూ.

అరువా అందుకు ఒప్పుకుని, తన కొడు కును వదిలేసి, మిగిలిన తన కుటుంబంతో వేరేచోటుకు వెళ్ళిపోయాడు.






నహుషుడు మొదట మహా సజ్జనుడు, కాని ఇంద్రపదవి రాగానే భోగలాలసుడై పోయి, దేవస్త్రీలతో విహరిస్తూ ఒకనాడు ఇంద్రుడి భార్య అయిన శచీదేవిని చూసి, ఆమెను మోహించాడు. తాను ఇంద్రుడే గనక శచీదేవి ఇప్పుడు తనకు భార్యగా ఉండాలని నహుషుడు కబురు చేసేసరికి, శచీదేవి భయపడి బృహస్పతి శరణు జొచ్చింది.

ఈ సంగతి విని నహుషుడు బృహస్పతి పైన మండిపడి, ఋషులనూ దేవతలనూ తిట్టాడు.

"పరపురుషుడి భార్యను కోరటం మహా పాతకం," అని వాళ్ళు నహుషుడికి నీతి చెప్పారు.

"ఇంద్రుడు ఇలాటి పనులు చాలా చేశాడు. మీరంతా అతనికి నీతి చెప్పలేక పోయారా?" అని నహుషుడు వారిని అడిగాడు.

అప్పుడు దేవతలు బృహస్పతి వద్దకు వెళ్ళి, "మహాత్మా, నహుషుడు చాలా కోపంగా ఉన్నాడు. శచీదేవిని అతని భార్యగా ఉండమని ఒప్పించు. లేకపోతే లోకాలకు క్షేమం లేదు," అన్నారు.

"నేను ఎన్ని బాధలైనా పడతానుగాని నహుషుడికి భార్యగా ఉండను," అన్నది శచీదేవి. బృహస్పతి కూడా, శరణుజొచ్చిన శచీదేవిని రక్షించి తీరుతానన్నాడు.

ఆ పరిస్థితిలో, నహుషుడి ఆగ్రహం చల్లారేటట్టూ, శచీదేవికి ఇబ్బంది కలగ




కుండా ఉండేటట్టూ ఒక ఉపాయం ఆలోచించవలసి వచ్చింది.

"నహుషుడు గర్వోన్మత్తుడై, పతనం కావటానికి తగిన స్థితిలో ఉన్నాడు. అందు చేత, ప్రస్తుతానికి శచీదేవి అతని వద్దకు వెళ్ళి, కొంత వ్యవధి అడిగి వస్తే, ఈ సమస్యను కాలమే తీర్చవచ్చు," అని బృహస్పతి దేవతలతో అన్నాడు.

ఆ ప్రకారమే శచీదేవి నహుషుడి వద్దకు వెళ్ళి, "ఇంద్రుణ్ణి గురించి ఏ వార్తా తెలియటం లేదు. ఏ సంగతీ తెలియగానే నీకు భార్యను అవుతాను," అన్నది.

ఈ లోపల మునులు ఇంద్రుణ్ణి పట్టుకుని పాపక్షయం కోసం అశ్వమేధం చేయించారు. ఇంద్రుడు స్వర్గానికి తిరిగి వచ్చి, నహుషుడి తేజస్సు చూసి భయపడి, మళ్ళీ ఎటో పారిపోయాడు. శచీదేవి అతన్ని వెతుక్కుంటూ వెళ్ళి, "నహుషుణ్ణి చంపి నీ ఇంద్రత్వం నువు తిరిగి పొందు," అని కోరింది.

"నహుషుణ్ణి ఇప్పుడు బలంతో గెలవటం సాధ్యం కాదు. ఉపాయంతో గెలవాలి. ఆ ఉపాయం నీ చేతిలో ఉన్నది. నహుషుడు నిన్ను కోరుతున్నాడు గనక, ఋషుల చేత మోయించుకుని నీ యింటికి రమ్మని నహుషుడితో చెప్పు. దానితో నహుషుడు పతనమవుతాడు," అన్నాడు ఇంద్రుడు.

ఋషుల చేత మోయించుకుని తన వద్దకు రమ్మని శచీదేవి అడగగానే నహుషుడు పరమానంద భరితుడై, మునుల చేత పల్లకీ మోయిస్తూ బయలుదేరాడు. దారిలో మునులు అతనితో ఏదో వాదం వేసుకున్నారు. నహుషుడు ఆగ్రహించి అగస్త్యుడి తలను తన కాలితో తన్నాడు. అగస్త్యుడు కోపించి, పాము కమ్మని నహుషుణ్ణి శపించాడు. దానితో నహుషుడు స్వర్గభ్రష్టుడయాడు. ఇంద్రుడు తిరిగి తన పదవి సంపాదించుకుని, శచీదేవితో సుఖంగా ఉన్నాడు.

శల్యుడు ధర్మరాజుకు ఈ కథ చెప్పి, దుర్యోధనుడి వద్దకు వెళ్ళిపోయాడు.

ద్రుపదుడి పురోహితుడు పాండవుల దూతగా హస్తినాపురానికి చేరే లోపుగా పాండవ కౌరవ పక్షాల చేరవలసిన వారు సేనలతో సహా వచ్చి చేరారు.



పాండవుల పక్షాన యుద్ధం చెయ్యటానికి ఏడు అక్షౌహిణుల సేన ఉపప్లావ్యంలో చేరింది. మహారథుడైన యుయుధానుడు ఒక అక్షౌహిణీ సేన తెచ్చాడు. చేదిరాజైన ధృష్టకేతుడు కూడా అంత సేనతో వచ్చాడు. జరాసంధుడి కొడుకైన జయత్సేను డనేవాడు ఒక అక్షౌహిణీ సేనతో వచ్చాడు. పాండ్య దేశపురాజు పర్వతప్రాంతీయులైన యోధులతో ధర్మరాజుకు సహాయం వచ్చాడు. ద్రుపదుడు అనేక దేశాలకు చెందిన యోధులనూ, మహారథులైన తన కొడుకులనూ వెంట బెట్టుకుని పెద్ద సేనతో వచ్చాడు. మత్స్యదేశపు రాజైన విరాటుడు గిరిజన సైనికులను తన వెంట తెచ్చాడు. ఇంకా అనేక దేశాలవారు వేరు వేరు ధ్వజాలెత్తి కౌరవులతో యుద్ధం చెయ్యటానికి వచ్చారు.

అదే సమయంలో, దుర్యోధనుడి పక్షాన పాండవులతో యుద్ధం చెయ్యటానికి పదకొండు అక్షౌహిణుల సేన అయత్తమయింది. నరకాసురుడి కొడుకైన భగదత్తుడు చీన కిరాతులతో కూడిన ఒక అక్షౌహిణి సేనను వెంట బెట్టుకుని దుర్యోధనుణ్ణి చేరాడు. అది మహా బలసంపన్నమైన సేన. అలాగే భూరిశ్రవసుడూ, శల్యుడూ చెరొక అక్షౌహిణీ సేనా తెచ్చారు. ఆకులూ, పూలూ కలిపి కట్టిన కదంబమాలలు ధరించిన ఏనుగుగున్నల లాటి యోధులను కృతవర్మ తెచ్చాడు. సింధుసౌవీరదేశాల నుంచి జయద్రథుడు (సైంధవుడు) మొదలుకుని అనేకమంది రాజులు దుర్యోధనుడి వద్దకు వచ్చారు. వారి సేనలు ఒక అక్షౌహిణి ప్రమాణంలో ఉన్నాయి. దక్షిణాన మాహిష్మతీపురం నుంచి నీలుడు భయంకరమైన ఆయుధాలు ధరించిన గొప్ప యోధులను వెంట బెట్టుకు వచ్చాడు. అవంతిదేశపు రాజులు రెండు అక్షౌహిణుల సేన తెచ్చారు. కేకయదేశపు రాజులు, ఒక అక్షౌహిణి సేన




తెచ్చారు. ఇంకా ఇతర దేశాల నుంచి వచ్చిన చిల్లర సేనలన్నీ కలిసి మూడు అక్షౌహిణులు అయాయి.

దుర్యోధనుడి పక్షాన వచ్చిన రాజులకే హస్తినాపురంలో చోటు చాలలేదు. ఇక వారి సేనల మాట చెప్పనే అవసరం లేదు. ఆ సేనలను పంచనదం లోనూ, గురుజాంగలం లోనూ, రోహితకారణ్యాల లోనూ, మరుభూమి లోనూ, అహిచ్ఛత్రం లోనూ, కాలకూట, గంగాకూటాల లోనూ, వారణం లోనూ, వాటధానం లోనూ, విస్తీర్ణమైన యమునాతీరానా సర్ది, శిబిరాలు ఏర్పరచారు.

ఈ విధంగా అక్కడక్కడా విడిసి ఉన్న సేనలను చూసుకుంటూ ద్రుపదుడి పురోహితుడు హస్తినాపురం చేరి, ధృతరాష్ట్రుడి సభాభవనానికి వెళ్ళాడు. ఆ వృద్ధబ్రాహ్మణుడికి విదురుడూ, భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ మర్యాదలు జరిపి, పాండవులను గురించి కుశలప్రశ్నలు చేశారు. ఆ బ్రాహ్మణుడు కూడా దుర్యోధనాదుల కుశలం అడిగి, నిండు సభలో అందరూ వింటూండగా ఇలా అన్నాడు:

"సభాసదులారా, ధృతరాష్ట్రుడూ, పాండురాజూ ఒకరి బిడ్డలే. తండ్రి తాతల ఆస్తిలో ఇద్దరికీ సమభాగం ఉన్నది. అలాటప్పుడు ధృతరాష్ట్రుడి కొడుకులు తమ తండ్రి ఆస్తి అనుభవించుతూ ఉండటానికీ, పాండురాజు కొడుకులు తమ తండ్రి ఆస్తి అనుభవించక పోవటానికీ కారణం ఏమిటి? పాండవులు తమ ఆస్తి అనుభవించకుండా దుర్యోధనుడు వారిని ఎన్ని బాధలు పెట్టినదీ మీరు మరిచిపోలేరు. పాండవుల ఆయువు గట్టిది కాకపోతే వారు ఏనాడో చచ్చిపోయి ఉందురు. అంతేకాదు, పాండవులు తమ స్వశక్తితో గెలుచుకున్న రాజ్యాన్ని కూడా ధృతరాష్ట్రుడి కొడుకులు మాయజూదంలో కాజేశారు. పాపాల భైరవుడు శకుని వారి దుర్మార్గాలకు సహాయపడ్డాడు. పదమూడేళ్ల పాటు పాండవులు తమ భార్యతోసహా అరణ్యాలలో పడరాని పాట్లు పడ్డారు. విరాటనగరంలో వారు గడిపిన జీవితం చెప్పదగి



సదీ వినదగినదీ కాదు. ఇంత జరిగినా పాండవులు కౌరవులతో శాంతి కోరుతున్నారు. వారికి కౌరవులతో యుద్ధం చెయ్యాలన్న కోరిక లేదు. యుద్ధం వల్ల జనక్షయం కలుగుతుంది. ఎవరికీ ఏ మాత్రమూ కీడు రాకుండా తమ రాజ్యభాగాన్ని తాము తిరిగి పొందాలని వారి కోరిక. దుర్యోధనుడికి తన బలంలో తనకు అమితమైన నమ్మకం ఉన్నది. దానికి తోడు అంతులేని సైన్యాలు వచ్చి చేరాయి గనక తాను గెలుస్తానని అతను భ్రమపడుతున్నాడు. దుర్యోధనుడి సేనలో నాలుగు అక్షౌహిణులుంటే ఏమయింది? పాండవసేనలో సాత్యకీ, భీముడూ, నకుల సహదేవులూ ఒక్కొక్క అక్షౌహిణికి సమానులు. అర్జునుడు ఒక్కడే ఇన్ని అక్షౌహిణుల ఎత్తు. అలాటి వాడే కృష్ణుడు. ఇలాటి బలసంపదగల పాండవులపై బుద్ధిగల వాడెవడూ యుద్ధం తలపెట్టడు. పాండవులతో సఖ్యం చెయ్యటానికి ఈ తరుణం మించిపోతే మరి రాదు.''

ద్రుపదుడి పురోహితుడు ఇలా చెప్పిన మీదట భీష్ముడు, ''బ్రాహ్మణోత్తమా, నీ మాటలు కటువుగా ఉన్నా వాటిలో నిజం ఉన్నది. పాండవులు యుద్ధానికి సిద్ధం కావటమూ, శాంతిని కోరటమూ కూడా ఉచితమే. పాండవులు అష్టకష్టాలూ పడిన మాట అబద్ధం కాదు. అర్జునుడు అనేక అస్త్రాలు తెలిసిన మహాయోధుడు. వజ్రాయుధం గల ఇంద్రుడే అతనికి ఎదురు నిలవలేడు, మిగిలిన వారి మాట చెప్పేదేమిటి?'' అన్నాడు.

భీష్ముడి మాట పూర్తి కాకుండానే కర్ణుడు లేచి, ''బ్రాహ్మణోత్తమా, మీరు చెప్పినదంతా అందరికీ తెలిసినదే. ధర్మరాజు తాను ఆమోదించిన నియమం ప్రకారమే, జూదంలో ఓడి అరణ్యాలకు పోయాడు. పోయినవాడు మూర్ఖుడిలాగా ఇప్పుడు మళ్ళీ రాజ్యం అడుగుతున్నాడు. పాండవుల బలానికి బెదిరి దుర్యోధనుడు వారికి ఒక్క అడుగు మోపినంత భూమి కూడా ఇయ్యడు. వారికి నిజంగా రాజ్యం



కావాలంటే తిరిగి వనవాసం చెయ్యాలి. రాజ్యం కోసం ధర్మం విడిచి వారు యుద్ధానికి తలపడ్డారు," అన్నాడు.

భీష్ముడు చిరాకుపడి, "కర్ణా, ఎందుకీ వ్యర్థపు మాటలు? అర్జునుడు ఒంటరిగా మనలనందరినీ అవలీలగా ఓడించిన సంగతి అప్పుడే మరిచావా? ఈ బ్రాహ్మణుడు చెప్పిన ప్రకారం చెయ్యకపోతే అర్జునుడి కోపాగ్నికి మనమంతా రెక్కపురుగుల్లాగా మాడిచస్తాం," అన్నాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడు కల్పించుకుని, కర్ణుణ్ణి మందలించి, భీష్ముడు అందరికీ మేలుకోరే మాట్లాడాడని అతన్ని హెచ్చరించి, ద్రుపదుడి పురోహితుడితో, "అయ్యా, నేను బాగా ఆలోచించి, నా సమాధానం పాండవులకు సంజయుడి ద్వారా అందజేస్తాను. మీరు పాండవుల వద్దకు తిరిగి వెళ్ళండి," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఆ బ్రాహ్మణుణ్ణి సగౌరవంగా సాగనంపి, సంజయుణ్ణి పిలిపించి, "సంజయా, నువు వెంటనే బయలుదేరి ఉపప్లావ్యానికి వెళ్ళి, ధర్మరాజును కలుసుకుని క్షేమం అడిగి, వాళ్ళు కష్టాల నుంచి బయట పడినందుకు అభినందించు. తరవాత కృష్ణుణ్ణీ, పాండవులకు యుద్ధంలో సహాయం వచ్చిన ముఖ్యులనూ పలకరించు. మన మూలాన పాండవులు అనేక కష్టాలు పడ్డారు. వారివల్ల ఒక్క కీడు కూడా మనకు కలిగినట్టు నాకు గుర్తురావటం లేదు. ధర్మరాజు మన మీద అలిగి యుద్ధం చేస్తాడని తలుచుకుంటేనే నాకు భయంగా ఉన్నది. భీమార్జునులు యుద్ధంలో ఎదురులేని వాళ్ళు. నువు వారితో ఏం చెబుతావో నీ యిష్టం! యుద్ధం జరగకుండా ఏదో ఒకటి చెప్పి, పాండవపక్షం వారిని ఒప్పించు," అన్నాడు.

సంజయుడు రథం మీద ఉపప్లావ్యం చేరి, ధర్మరాజును కలుసుకున్నాడు. ఇద్దరూ ఉభయపక్షాల వారి క్షేమం అడిగి తెలుసుకున్న అనంతరం సంజయుడు, అందరూ వింటూండగా ఈ విధంగా తెలిపాడు:

"ధృతరాష్ట్రుడు శాంతి కోరి నన్ను పంపాడు. పాండవులు శాంతించాలి. వారిని లోకం ఆదర్శపురుషులుగా భావిస్తున్నది. అలాటప్పుడు వారిలో ఎలాటి కల్మషం కనిపించినా అది నూరింతలు అనిపిస్తుంది. జయాపజయాలు నిర్ణయించటానికి వీలు లేని యుద్ధం ఎంత మాత్రమూ కోరదగినది కాదు. కౌరవులను చంపి రాజ్యం తీసు కుందా మనుకోవటం యోగ్యమైనది కాదు. జ్ఞాతులను చంపటం కన్న మరణం మేలు. పాండవబలం దేవతలనైనా జయించరానిది. అలాటిదే కౌరవబలం కూడా. ఈ రెండు బలాలకూ యుద్ధం జరిగితే ఎవరు జయిం చినా ఒకటే నని, కొంచెమైనా సుఖం ఉండదనీ నా నమ్మకం. పాండవుల వంటి వారు ధర్మార్థాలకు దూరమైన హీనమార్గం తొక్కరనుకుంటాను. శాంతి చేకూరేటట్టు చూడమని నేను మీ అందరినీ చేతులు మోడ్చి ప్రార్థిస్తున్నాను."

సంజయుడు ఇలా అన్న మీదట ధర్మ రాజు, "సంజయా, నేను యుద్ధం కోసం తపించి పోతున్నట్టు మాట్లాడానా? శాంతి వల్ల సమకూరేదానికి యుద్ధం చేసేమూర్ఖుణ్ణి కాను. బుద్ధిమంతుడైన వాడు తన సుఖం గురించి ఆలోచించినట్టే పరుల సుఖం గురించి కూడా ఆలోచించాలి. కారడవిలో, చిచ్చురేపి కార్చిచ్చు ప్రజ్వలిస్తుంటే,



'అయ్యో నాకు అపాయం!' అనే వాడు మూఢుడు కాడా? దుర్మార్గుడైన దుర్యో ధనుణ్ణి సమర్థించుతూ ధృతరాష్ట్రుడు ఎలా సుఖం పొందగలడు? కపట జూదం ఆడిన నాడే కౌరవుల వినాశనం ఆరంభమయింది. కాని కౌరవులతో శాంతంగా సహజీవనం చెయ్యటానికి నాకు అభ్యంతరం లేదు. వారు మాకు లోగడ చేసిన ద్రోహాలన్నీ మరిచిపోతాను. నాకు ఇంద్రప్రస్థం మటుకు ఏలుకోవటానికి ఇయ్యమను. దుర్యోధనుణ్ణే రాజరాజుగా ఉండనీ," అన్నాడు.

దానికి సంజయుడు, "ధర్మరాజా, నువు ఎన్నడూ ధర్మం తప్పి ఎరగవు. తుచ్ఛమైన రాజ్యభోగం కోసం నీ కీర్తిని శాశ్వతంగా

కళంక పరచుకొంటావా? యుద్ధం ఆలోచన మాను. కౌరవులు నీకు రాజ్యభాగం ఇయ్యరు. యుద్ధం చేసి రాజ్యం పొందేకన్న, నువూ, నీ తమ్ములూ యాచనా వృత్తితో జీవించటం కీర్తికరమైనది,'' అన్నాడు.

సంజయుడు ధర్మాధర్మాలను గురించి చెప్పినది ధర్మరాజు ఒప్పుకోక, ఆపద్ధర్మం ఉంటుందనీ, ఆపదల నుంచి బయటపడ టానికి అధర్మం చెయ్యటం కూడా ధర్మమే నన్నాడు; తనకు కృష్ణుడు ఏది చెబితే అదే ధర్మమన్నాడు.

కృష్ణుడు సంజయుడితో, ''నువు శాంతి, శాంతి అని అంటున్నావు. రాజులకు యుద్ధం చెయ్యటం ధర్మం కాదంటావా? అధర్మా నికి పాల్పడిన వాళ్ళు ధృతరాష్ట్రుడి కొడు కులు. దుర్యోధనుడు పాండవుల సొత్తు అధర్మంగా హరించాడు. అందులో రాజ ధర్మం ఏమున్నది? దొంగకూ, దుర్యోధను డికీ భేదమేమిటి? ఇన్నాళ్ళూ అతను పాండ వుల ఆస్తి అనుభవించాడు? ఇప్పుడు వారి సొత్తు వారి కెందుకు ఇయ్యడు? పరుల రాజ్యం అనుభవించే కంటె సొంత రాజ్యం వెయ్యిరెట్లు మంచిది. దాని కోసం యుద్ధం చేసి చావటమైనా మాకు ఇష్టమే. కౌరవ సభలో ఈ మాట గట్టిగా చెప్పు,'' అన్నాడు.

సంజయుడు తనవల్ల తప్పులేవైనా ఉంటే క్షమించమని అందరినీ కోరి, అందరి వద్దా సెలవు పుచ్చుకుని బయలుదేరబోతూండగా ధర్మరాజు, ''సంజయా, మేము నిజంగా శాంతినే కోరుతున్నాము. ధృతరాష్ట్రుడు కూడా శాంతినే కోరే పక్షంలో మాకు రాజ్యంలో కొంత భాగమైనా ఇయ్యమను. మా అయిదుగురికీ అయిదు ఊళ్ళు ఇయ్య మను. కుశస్థలమూ, వృకస్థలమూ, మాకందీ, వారణావతమూ అనే ఊళ్ళకు తన యిష్టం వచ్చిన ఊరు మరొకటి కలిపి ఇయ్యమను. అందరమూ సుఖంగా ఉండవచ్చు. నేను శాంతికి ఎంత సంసిద్ధుణ్ణో, యుద్ధానికి కూడా అంత సంసిద్ధుణ్ణే,'' అన్నాడు.

ఈ సందేశం కూడా తీసుకుని సంజ యుడు హస్తినాపురానికి తిరిగి వెళ్ళి పోయాడు.






## 22

విశ్వనాథుడూ, విశాలాక్షీ కాపరం ఉంటున్న కాశీనగరంలో కొంతకాలం నివసించు దామన్న కోరిక కలవాడై వేదవ్యాసుడు తన శిష్యగణంతో సహా కాశీకి చేరాడు. ఆయన శిష్యులలో వైశంపాయనుడూ, జైమినీ, పైలుడూ, సుమంతుడూ మొదలైన మహా మహులు ఎందరో ఉన్నారు.

వాళ్ళు ఉదయాన కాలకృత్యాలు తీర్చుకుని, గంగాస్నానం చేసి, సంధ్యవార్చి, గాయత్రీజపం చేసి, అగ్నికార్యం అయాక, శివార్చన చేసి, ముక్తిమండపంలో మధ్యాన్నం దాకా శివపురాణం పఠించి, ఊళ్ళో భిక్షాటన చెయ్యటానికి తలా ఒక దారినా బయలుదేరారు.

ఆ సమయంలో విశ్వేశ్వరుడు విశాలాక్షితో, "వ్యాసుడి మనస్సు ఎలాటిదో చూస్తాం. అతనికీ, అతని శిష్యులకూ ఎక్కడా భిక్ష పుట్టకుండా చెయ్యి." అన్నాడు.

విశాలాక్షి సరేనని, కాశీనగరంలో ఏ ఇల్లాలికీ భిక్ష పెట్టే ఇచ్ఛలేకుండా చేసింది. దాని ఫలితంగా వ్యాసుడు "భిక్షాం దేహి" అని అరుస్తూ ఇల్లిల్లూ తిరుగుతూ ఉంటే, ఇల్లాళ్ళు, "వంట కాలేదు," అనీ, మళ్ళీ రమ్మనీ, "ఇవాళ మా ఇంట ఆబ్దికం," అనీ అన్నారు.

కొందరు గృహస్థులు మూసిన తలుపులు తెరవను కూడా లేదు.

వ్యాసుడికి జరిగినట్టే ఆయన శిష్యులకూ జరిగింది. పొద్దు వాలేదాకా ఊరంతా చెడ తిరిగి, కాలుతున్న కడుపులతో అందరూ మఠానికి చేరుకున్నారు.

"నాకు ఎక్కడా ఒక్క మెతుకు పుట్ట లేదు. మీకైనా భిక్ష దొరికిందా?" అని

అట్ట చివరి బొమ్మ



63



ఎనిమిదో రోజు వచ్చింది. మళ్ళీ నిత్య కృత్యాలు తీర్చుకుని, కాశీలోని దేవుళ్ళ కందరికీ దణ్ణాలు పెట్టుకుని, వ్యాసుడూ ఆయన శిష్యులూ తలా ఒక దారినా భిక్షాటనకు బయలుదేరారు.

వ్యాసుడికి ఒక్క ఇంటా భిక్ష దొరకలేదు. ఆయనకు పట్టరాని ఆగ్రహావేశం వచ్చింది. నుదిటి మీద చెమట పట్టింది. కణతలు అదురుతున్నాయి. ఆయన నడివీధిలో తన భిక్షాపాత్రను రాళ్ళ కేసి కొట్టి పగలగొట్టి, కాశీలో మూడు తరాల వాళ్ళకు విద్యా, ధనమూ, భక్తీ లేకుండా పోవాలని శాపం పెట్టటానికి కమండలంలో నుంచి శాపజలం అందుకోబోయాడు. కాని అదేం చిత్రమో, చెయ్యేవణికి పోతూ ముందుకు రాకపోయింది.

అంతలో ఆ వీధిలో ఉన్న ఒక ఇంటి తలుపు తెరుచుకుని యాభైఏళ్ళ స్త్రీ, సర్వాభరణ భూషితురాలు, బయటికి వచ్చి, "ఓ బ్రాహ్మడా, శాపం వద్దు! ఇలారా!" అని పిలిచింది.

వ్యాసుడు పరమానందభరితుడై, ఆ స్త్రీ ఎవరో, ఏ కులమో కూడా తెలుసుకోకుండానే, ఆమెకు నమస్కారం చేశాడు. ఆయన దగ్గిరికి రాగానే ఆమె, "భిక్ష దొరకనంత మాత్రాన కాశీనగరాన్ని శపిస్తావా? నీ మనశ్శుద్ధి తెలుసుకోవటానికి విశ్వ

వ్యాసుడు తన శిష్యులను అడిగాడు. వాళ్ళు దొరకలేదన్నారు.

"పొద్దునే లేచి ఏ పాపాత్ముడి ముఖం చూశామో!" అన్నాడు వ్యాసుడు.

ఏడు రోజులు వరసగా ఇలాగే జరిగింది. ఒకప్పుడు దివోదాసు వైభవంగా ఏలి, ప్రస్తుతం విశ్వనాథుడు ఉంటున్న కాశీనగరంలో, ప్రతి ఇల్లాలూ ఒక అన్నపూర్ణ అని లోకం చెప్పుకుంటూండగా తమకు ఈ ఉపవాసాలు ఎలా సంప్రాప్తమయాయో వ్యాసుడికి అర్థం కాలేదు. వైశంపాయనుడూ, సుమంతుడూ, పైలుడూ, జైమినీ, దేవలుడూ, దాల్భ్యుడూ వడిలిపోయి, శోష వచ్చినట్టున్నారు.

నాథుడు ఇలా చేశాడు గాని. కాశీనగరంలో తిండికి లోటేమిటి? మధ్యాన్నం అతిథి వేళప్పుడు అన్నపూర్ణ అభ్యాగతులకు బంగారు గరిటెతో అమృతపాయసం ఇస్తుం దని నువు వినలేదా? ఏడు రోజులు అన్నం లేదని దుఃఖించి. నీ ధీరత్వం కోల్పోయి. శివుడి రెండో భార్యలాటి కాశీని నాశనం చెయ్య బూచావు. ఆకలి ఎంత పాపమైనా చేయిస్తుందన్నమాట నువే నిరూపించావే! భిక్ష పెడతాను రా.'' అన్నది.

ఆ మాట విని వ్యాసుడు. ''తల్లీ, ఇన్నా ళ్ళకు ఇంత తియ్యని మాట చెవుల బడింది. భిక్షకు నన్ను ఒక్కణ్ణే రమ్మన్నావా. లేక ఆకలి మీద ఉన్న నా శిష్యులను కూడా వెంట తెమ్మన్నావా? అందరివీ ప్రాణాలే గద! మా అందరికీ నువు నీకు తోచిన భిక్ష పెట్టితే అందరమూ పంచుకు తింటాం,'' అన్నాడు.

ఆ మాటకు ఆమె చిరునవ్వు నవ్వి. ''నాయనా, మధ్యాన్న పూజలు గంగ వద్ద ముగించుకుని మీ రందరూ రండి. అందరికీ కడుపు నిండా తృప్తిగా భోజనం పెడతాను,'' అన్నది.

వ్యాసుడు తన మూడువందల శిష్యులతో గంగకు వెళ్ళి. మధ్యాహ్నికాలు ముగించు కుని. ఆ ఇంటికి తిరిగి వచ్చాడు. వారిని ఆ వృద్ధురాలు లోపలికి తీసుకుపోయి,



భోజనశాలలో పీటల మీద కూర్చోబెట్టింది. అందరి ముందూ పెద్ద పెద్ద అరటిఆకులు వేశారు. వృద్ధురాలు అందరికీ అక్షింతలూ, ధూపమూ ఇచ్చి, పంక్తుల మధ్య నిలబడి, ''నాయనలారా, అందరూ ఆపోశనలు పట్టి, తాపీగా భోజనాలు కానివ్వండి. కాశీ విశ్వ నాథుడికి ప్రీతి చెయ్యండి.'' అన్నది.

వ్యాసుడూ. ఆయన శిష్యులూ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. విస్తళ్లలో ఏ పదార్థమూ లేదు. వంట పాత్రలు లేవు. కనీసం వంట వాసన అయినా కొట్టటం లేదు.

''ఈ ముసలావిడ ఉత్తుత్త భోజనం పెట్టుతున్నది. ఇవాళ కూడా మనకు పస్తే!'' అని వాళ్ళు అనుకున్నారు.

వాళ్ళు ఇలా అనుకుంటూ ఉండగా స్త్రీలు వచ్చి, అందరికీ ఆపోసనలు ఇచ్చారు.

"నాయనలారా, పొద్దు చాలా అయింది. ఇక భోజనాలకు ఉపక్రమించండి," అన్నది వృద్ధురాలు వారితో.

వాళ్ళు ఆపోసనలు పట్టిన మరుక్షణం అందరి విస్తళ్ళలోనూ పంచభక్ష్యపరమాన్నాలు వెలిశాయి. ఎవరికి ఏయే పదార్థాలు ఇష్టమో వారి వారి విస్తళ్ళలో అవి అన్నీ ప్రత్యక్షమయాయి.

"ఈ ముసలావిడ సాక్షాత్తూ అన్నపూర్ణాదేవే అయి వుండాలి," అనుకుని అందరూ ఆత్రంగా భోజనాలు చేశారు.

భోజనాలు అయి పోగానే వృద్ధురాలు వ్యాసుడు మొదలైన వారందరికీ విశ్రమించటానికి చోటు చూపించింది.

కొంతసేపటికి విశ్వనాథుడు పార్వతీ సమేతుడై, వ్యాసుడు తన శిష్యులతో సహా విశ్రమించి ఉన్న చోటికి వచ్చాడు. పార్వతి ముఖం ప్రశాంతంగా ఉన్నది, కాని శివుడి ముఖాన కోపం తాండవిస్తున్నది.

శివపార్వతులు రాగానే అందరూ ప్రణామాలు చేసి, చేతులు మోడ్చి నిలబడ్డారు.

శివుడు పార్వతితో సహా ఒక వేదిక మీద కూర్చుని, వ్యాసుడి కేసి కోపంగా చూస్తూ, "ఓరీ దుర్మార్గుడా! భారతం రాసిన శుంఠా! అహంకరించి, నా భార్యలాటి కాశీనగరానికి శాపం ఇవ్వబోతావా? నువు కాశీలో అడుగు పెట్టటమే ద్రోహం! వెంటనే నువూ, నీ శిష్యులూ మా పొలిమేర దాటి వెళ్ళిపొండి," అన్నాడు.

వ్యాసుడు పార్వతీ పరమేశ్వరుల కాళ్ళకు మొక్కి, తన శిష్యులతో సహా కాశీ నుంచి వెళ్ళిపోవటానికి సిద్ధమయాడు.

అప్పుడాయనతో పార్వతీదేవి, "నాయనా, విచారించకు. నువు మరెక్కడికీ వెళ్ళక, దక్షారామానికి వెళ్ళి, భీమేశ్వరుణ్ణి సేవించు. నీకు సమస్త శుభాలూ చేకూరుతాయి," అన్నది.

ఆమె సలహా ప్రకారం వ్యాసుడు తన శిష్యులతో సహా, భీమేశ్వరుణ్ణి అర్చించటానికి దక్షారామానికి వెళ్ళిపోయాడు.



# 132. "నూరేళ్ళ చెట్టు"



కారిబియన్ సముద్రంలో పోర్టరికోకు తూర్పుగా ఉన్న "వర్జిన్" దీవులు అమెరికనులకు విలాన యాత్రాస్థలాలు. 1493 లో వీటిని కొలంబస్ సందర్శించాడు. 1917 లో ఇవి అమెరికా అధీనం లోకి వచ్చాయి. ఇవి మూడు దీవులు. వీటి పేర్లు: సేంట్ టామస్, సేంట్ జాన్, సేంట్ క్రాయ్. ఇక్కడ ఉండేవారు హెచ్చుగా నీగ్రోలు. వారు యాత్రికులపై ఆధారపడి జీవిస్తారు. చక్కని సముద్ర తీరాలూ, సమశీతోష్ణమైన వాతావరణమూ యాత్రికులను ఇక్కడికి ఆకర్షిస్తాయి.

ఈ దీవులలోని వింతలలో ఒకటి "నూరేళ్ళ చెట్టు". దీని ఆకులు దళసరిగా ఉంటాయి. ఇది నూరేళ్ళకొకసారి పూస్తుందన్న ఊహ కారణంగా దీనికి ఈ పేరు వచ్చింది. దీని పూలు కొనదేలి, పచ్చగా, గుత్తులు గుత్తులుగా ఉంటాయి. ఈ పూలగుత్తులు అయిదేళ్ళ వయ సులో కూడా పూయవచ్చు. కాని పూతరాగానే ఈ చెట్టు చచ్చిపోతుంది.



Photo by D. N. Shirke



బహుమతి పొందిన వ్యాఖ్య

అక్షరకుక్షి

పంపినవారు : రాధాకుమారి

Photo by P. R. Shinde



ఏ 6, టి. బి. రోడ్,
మద్రాసు—35

జాతీయపక్షి

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు డిసెంబర్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఫిబ్రవరి 1973 సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

# న్యూట్రిన్ రంగుల పోటీ ఎంతో ఉత్సాహపూరితమైనది!

**444 బహుమతులు గెలువవచ్చు!**

పోటీ ముగింపుతేదీ
డిసెంబరు 31, 1972



త్వరపడండి! మీ డీలరువద్దనుండి మీ ఎంట్రీ ఫారాన్ని నేడే తీసుకోండి!

NCM-39A/72 TEL

## వయస్సు 3 గ్రూపులలో

'ఏ' - 8 సంవత్సరాలలోపు
'బి' - 8-10 సంవత్సరాలమధ్య
'సి' - 11-14 సంవత్సరాలమధ్య

3 ప్రథమ బహుమతులు
ఒక్కొక్కటి రు. 501+ రిస్టువాచి + ప్యాకెట్ ట్రాన్సిస్టరు
9 ద్వితీయ బహుమతులు
రిస్టువాచీలు
99 తృతీయ బహుమతులు
ప్యాకెట్ ట్రాన్సిస్టర్లు
333 సముచిత బహుమతులు!

## చాలా తేలిక!

పోటీలో పాల్గొనటం ఎలా: మీ డీలరువద్దనుండి ఒక ఎంట్రీఫారాన్ని తెచ్చుకోండి. చిత్రానికి రంగులు వేయండి. చిత్రానికి రంగులు వేయటం ఆహా! ఎంత ఉత్సాహకరమైనో! న్యూట్రిన్ మిఠాయిలు రు. 1/- ప్యాకెట్టులో న్యూట్రిన్ వెరలాడు స్టాంపు వుంది. చిత్రానికి రంగులు వేయటం పూర్తి అయ్యాక వెరలాడు స్టాంపును ఆ ఎంట్రీఫారముతో జాగ్రత్తగాను తప్పకుండా అంటించి ఈ క్రింది చిరునామాకు పంపండి.

న్యూట్రిన్ రంగుల పోటీ, న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, సంతపేట రోడ్, చిత్తూరు (ఆం. ప్ర.)

అర్హులైన బృందం న్యాయనిర్ణేతలుగా నియమించబడి ఎంట్రీలను పరిశీలిస్తారు.

రంగులు వేయుటం ఆరంభించండి - మీరే గెలుపొందవచ్చు!

71

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

**డాల్టన్ ఏజన్సీస్**

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు-26

# ఏనుగును తినడం ఎలాగ



ఔను ఔను ఏనుగే!

ఏనుగులు తియ్యగా గరగరలాడుతూ
తినడానికి పసందుగావుంటాయి.
అతి సులభంగా జీర్ణమవుతాయి కూడా.
అల్లాగే వుంటాయి
పులులు, సింహాలు,
జిరాఫీలు, హిపపొటమస్సులు,
కంగారులు, కుందేళ్లు, ఒంటెలు
ఒకటేమిటి బ్రిటానియా బిస్కట్ల
కంపెనీవారు తయారుచేసేవి—
అన్నీ. అవి బ్రిటానియా
బిస్కట్ల రూపంలో ఉంటాయి.
నోటిలో వేసుకోడానికి
అనువుగా వుండి ప్రతివారికి
విందు కల్పిస్తాయి. మీరు
వాటిని తిని ఆనందించండి.
జూనంతా మింగేయవచ్చు!
ఔను బ్రిటానియా జూ.





## బ్రిటానియా జూలాజికల్ బిస్కట్లు

**భారతదేశంలో అతి శ్రేష్ఠమైన బిస్కట్లు** బ్రిటానియా

BBC-2769

# చిక్‌లెట్స్ వేడుకతో పంచే చూయింగ్ గమ్




వేడుక చూడు, వినోదం చూడు, మాధుర్యమైన చిక్‌లెట్ చూడు! తినగా, తినగా ఎంత రుచి, నాలుగు రకముల నచ్చే రుచి!




లెమన్
ఆరెంజ్
పెప్పర్ మింట్
టుటాటీ-ఫ్రూటీ

WH. 3041



